# సత్యశోధన

(గాంధీమహాత్ముని ఆత్మకథ)

TRANSLATION OF
GANDHIJI'S AUTOBIOGRAPHY
ABRIDGED BY
BHARATAN KUMARAPPA

అనువాదకులు:
శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు



త్రివేణి పబ్లిషర్స్
మచిలీపట్టణము

# విషయ సూచిక

★

# ప్రథమ భాగము : బాల్య యౌవనములు

## 1

## జన్మాదికము

నాతండ్రి కరంచందు గాంధి పోర్బందరు సంస్థానమున ముఖ్యమంత్రి. స్వకులాభిమాని, సత్యప్రియుడు, ధీరుడు, ఉదారుడు నగు ఆయనకు శీఘ్రకోప మొకటి కద్దు. ధనము కూడబెట్టుటకై ఆయన యెన్నడు ప్రాకులాడి యెరుగడు. కావున మానాటి కే కొంచెమో ఆస్తి మిగిలినది.

గుజరాతి బడిలో ఐదవ తరగతి చదివెనేమోకాని అంతకు మించిన చదు వెరుగడాయన. దేశచరిత్రము, భూగోళశాస్త్రమును మొదలే యెరుగడు. అట్లయ్యు, లోకానుభవసంపదచే ఆయన వ్యవహారదక్షుడై, ఎట్టి చిక్కులనైన ఇట్టె విడదీసి, వేలకొలది ప్రజల నదుపులో నుంచెడివాడు. సంతత ధర్మప్రసంగ శ్రవణముచే, దేవాలయ దర్శనముచే హిందువు లందరికి అలవడు ధర్మబుద్ధి ఆయనకు నలవడినదే కాని వేఱుగా మతధర్మశిక్ష పొందినవాడు కాడు.

ఇక మాయమ్మను దలచికొన్నచో ఆయమ పరమసాధ్వీత్వము నా చిత్తమున వెలుగుచుండును. దేవపూజ చేసికాని ఆమె కుడువ నొల్లదు. నిత్యము విష్ణ్వాలయమును దర్శించి వచ్చుట తప్పదు.

నా యెరిగినంతలో ఆయమ చాతుర్మాస్యవ్రతము మానినది లేదు. ఆమె కఠోరనియమములు తాల్చి, ఏదియెట్లయినను, వానిని గొనసాగించెడిది ; జబ్బుగానున్నదని నేమము సడలించుకొనుట గిట్టదామెకు. చాతుర్మాస్యలలో నొకతూరి ఆమెకు జబ్బుచేసినను వ్రతమును మాత్రము విడనాడినది కాదు. రెండుమూడునాళ్లు వరుసగా నుపవసించుట ఆమె కొక లెక్కలోనిది కాదు. చాతుర్మాస్యలలో నేకభుక్తమున్నది చాలక ఆమె ఒకమారు దినమువిడచి దినము నిట్రుపాసము లుండెను. మరియొకమారు సూర్యదర్శనము చేయక భుజింపనని వ్రతము పట్టెను. నడివానకారున ప్రొద్దుదేవర తరచు మొగము చూపడు. కావున ఆనాళ్ళలో పిల్లలందరము ప్రొద్దు పొడచూపగనే మాయమ్మకు తెలుపవలెనని మింటిదెస జూచుచు నిలిచియుండెడివారము. ప్రొద్దు తటాలున పొడకట్టినంత మే మింటిలోనికి పరుగున నేగి మా యమ్మకు దెలుపగా, నామె బిరబిర నేతెంచి తన కనుల జూచునంతలో భాస్కరుడు మరుగు పడిపోవును. అంతట నామె "నేడు నేను భుజించుట భగవానున కిష్టములేదు కాబోలు" అని భుక్తి మానుకొని సంతోషముమై పనిపాటులు చూచుకొనబోవును.

మాయమ్మ మంచిచెట్టలను లెస్సగా నెరుగుటేకాక రాచకార్యములెల్ల బాగుగా ఆకళించుకొన్నది.

అట్టి జననీజనకులకు 2—10—1869 న సుదామపురి యను పోర్బందరులో ఈ నేను జన్మించితిని.

# 2

## విద్యాభ్యాసము

నా శైశవము పోర్బందరులోనే గడచెను. నన్ను చదువుల బడికి పంపుట జ్ఞప్తియందున్నది. నాకు ఎక్కము లొకపట్టున వచ్చినవికావు. తోడిబాలురతో గూడి అయ్యవారికి పేరులిడి ఎకసక్కెము లాడుకొనుట తప్ప ఆనాళ్ళలో ఇతర మేమియు నేర్చినట్లు ఇపుడాదకు వచ్చుటలేదు.

నా యేడవ యేట మా తండ్రి పోర్బందరు వీడి రాజకోట ప్రవేశించెను. నేనచట ప్రెయిమరీ బడిలో చేరితిని. నా కప్పటి ముచ్చటలెల్ల జ్ఞప్తియందున్నవి. పోర్బందరు నందువలెనే ఇచట గూడ నాచదువునుగూర్చి చెప్పదగినది లేదు. ఆ బడినుండి సబర్బను స్కూలులో, అటనుండి హైస్కూలులో చేరునాటికి నాకు పదిరెండవ యేడు వచ్చెను. ఆ కాలమున బడిపిల్లలతో గాని, అయ్యవార్లతోగాని నే నెన్నడు కల్లలాడినట్లు లేదు. నాకు వల్లమాలిన బిడియమగుటచే సావాసగాండ్ర నొల్లక నా పుస్తకములు, నా చదువే లోకముగా నుండెడివాడను. సరిగా గంటకొట్టు వేళకు బడికేగుట, బడి ముగియగానే పరుగున నిలు సేరుట — ఇదియే నా కలవాటయ్యెను. త్రోవలో నెవరు పలుకరించి పోవుదురోయని బడినుండి యింటి కొక్కటే పరుగు. ఎవరేని గేలిసేయుదురోయని కూడ బీతుగా నుండెడిది.

హైస్కూలులో నేను చేరిన మొదటియేట పరీక్షలవేళ జరిగిన విశేషమొకటి ఇచట చెప్పదగినది కద్దు. జైయిల్సు అను పరీక్షాధికారి మా స్కూలున కేతెంచెను. వర్ణక్రమము పరీక్షించుటకై

మనా కైవ మాటలు చెప్పి, వానిని వ్రాయుడనెను. వానిలో కెటిల్ (Kettle) అను శబ్దము నేను తప్పు వ్రాసితిని. మా యధ్యాపకుడు చల్లగా కాలితో పొడిచి నన్ను హెచ్చరించెను గాని నే నా యెచ్చరిక పాటింపనైతిని. ప్రక్కనున్న బాలుని పలకను జూచి తప్పు దిద్దుకొమ్మని ఆయన నన్ను హెచ్చరించుచున్నాడని నా మనసున కెట్లు తట్టును? మే మట్లు చేయకుండ గాపుదల కొసముగదా అధ్యాపకు డచట నున్నది? ఇంతకు, నేను తక్క తక్కిన బాలురెల్ల నిర్దుష్టముగా వ్రాసినవారైరి; నే నొక్కడనే మందబుద్ధి నైతిని. పిమ్మట మా యధ్యాపకుడు నా జేలతనమును నా కెరిగింప జూచెను గాని అది నిష్ఫలమయ్యెను.

ఈ వృత్తముచే మా యయ్యవారి పట్ల గౌరవము నా కించుకయు సన్నగిల లేదు. పెద్దల దోషములను గమనించు స్వభావము కాదు నాది. ఆయన యెడ మరి పెక్కు దోసగులున్నవని పిమ్మట నాకు దెలిసినను నా గురుభావ మట్లే యున్నది. పెద్దల యాజ్ఞ పాలించుటే నా కలవడెను గాని వారి పనులకు వంక లెన్నుట నేర్చినవాడగాను.

ఆకాలమునాటివే మఱిరెండు ముచ్చటలు నాకు జ్ఞప్తిలో నిలిచిపోయినవి. పాఠ్యగ్రంథములు తక్క ఇతరముల చదువగూడదని నేను నేమము పెట్టుకొంటిని. ఏనాటి పాఠ మానాడు చదువు టెట్లును తప్పదు. అట్లు చదువక అయవారి ఆగ్రహమునకు గురియగుట కాని, ఆయనను మోసగించుటగాని నావలనగాదు. కావున దిన పాఠము చదువుదును. ఆ చదువునపుడుగూడ మనసు తరచుగా చలించుచుండును. దినపాఠము మాటియే యిటులుండ

ఇతర గ్రంథపఠనమున కాస్కారమెక్కడ ? ఈ స్థితిలో మా తండ్రి 'శ్రావణపితృభక్తి నాటక' మను గ్రంథము గొనిరాగా నది నాకంట బడెను. ఆసక్తమై నేనా పుస్తకము జదివితిని. ఇంతలో బొమ్మ లాటగాండ్రా యూరికి వచ్చిరి. అంధులగు తల్లిదండ్రులను కావడిలో నిడి మూపునదాల్చి తీర్థాటనమొనర్చు శ్రావణుని బొమ్మనుగూడ చూపెట్టిరి. పుస్తకమున నేను చదివినదాని కాబొమ్మ సరిదాకి నా మనసున హత్తుకొనెను. 'పుత్రుడన నిట్టివాడు కదా' యనుకొంటిని.

ఆనాళ్ళలోనే మాయయ్య యనుమతిపై నేను హరిశ్చంద్ర నాటకము జూడబోయితిని. ఆ నాటకము నా హృదయమును లోగొనెను. దాని నెన్నిమారులు చూచినను తనివిదీరదు. అట్లని యెన్నిమారులు చూడనిత్తురు? ఆ నాటకమునుగూర్చియే తలపో యుచు, హరిశ్చంద్ర పాత్రమును నాలో నే నెన్నిమార్లు అభినయించు కొంటినో! "హరిశ్చంద్రునివలె అందరు సత్యవ్రత మేల యనుష్ఠింప రాదు?" రేబవళ్లు నా కిదియే ఆలోచన. ఎన్నియిడుములకైన నోర్చి హరిశ్చంద్రునివలె సత్యమును వీడకుండుటే పరమార్థమని నిశ్చయించుకొంటిని. హరిశ్చంద్రుని కథయంతయు యథార్థమే యనుకొంటిని. దానిని దలచికొని పలుమారు కన్నీటితో గుమా రిలితిని. నేను హైస్కూలులో మందబుద్ధి ననిపించుకొనక, అధ్యా పకులకు బ్రీతిపాత్రుడగూడ నైతిని. బాలుర నడవడినిగూర్చియు, విద్యా సక్తిని గూర్చియు ఏటేట తలిదండ్రులకు ఉపాధ్యాయు లంపు పత్రము లందు న న్నెన్నడు వారు చెడనాడినది లేదు. ద్వితీయకక్ష్య దాటి నది మొదలు నాకు పసదనములుగూడ ముట్టవొడగెను. ఐదవ కక్ష్యలో నాల్గును, ఆఱవ కక్ష్యలో పదియు రొప్యములు విద్యార్థి

వేతనముగూడ గడించుకొంటిని. ఇందులకు గారణము నా యదృష్టమేగాని యోగ్యతగాదు. ఈ వేతనములు కాథియవాడు నందలి సౌరాష్ట్ర ప్రాంతమునుండి వచ్చిన బాలురకేకాని అందరకు ఉద్దిష్టములు కావు. ఆ కక్ష్యలోని నలుబది యేబదిమంది బాలురలో సౌరాష్ట్రవాసు లెక్కువగా నుండరుకదా!

నా తెలివితేటలపట్ల అంతగా నమ్మక మున్నవాడగాను కావున నాకు బహుమానములు, విద్యార్థి వేతనములు లభించినప్పుడు నాలో నాకే అక్కజమయ్యెడిది. నా నడవడిని మాత్రము మెలకువతో గాపాడుకొనుచుంటిని. అందు ఇసుమంత లోపము కల్గినచో నాకు గళ్ళనీళ్ళపర్యంత మయ్యెడిది. నావలన తప్పిద మున్నపుడును, ఉన్నదని అయవా రెంచినపుడును నాకు దుఃఖము పొరలిపోయెడిది. అయ్యవారు నన్నొకపరి దండించిరి. దండించినందులకుగాదు గాని, నే నట్టి దండనకు యోగ్యుడనని యెంచిరికదా యని కడుపు చెరువుగా నేడ్చితిని. ఇది నేను మొదటి కక్ష్యలో నున్నప్పటి ముచ్చట. ఏడవ కక్ష్యలో నుండగాగూడ నిట్టిదే మరియొకటి జరిగెను. శ్రీ దొరాబ్జీ యెదుల్జీ గిమి మా కపుడు ప్రధానాధ్యాపకులు. బోధనా పటిమచే, నిష్ఠాపరత్వముచే, నియమపాలనముచే ఆయన శిష్యజనరంజకుడయ్యెను. పై తరగతుల బాలురందరకు శరీర వ్యాయామము, క్రికెటు ఆటయు తప్పనిసరిగా ఆయన విధించెను. నాకీ రెండునుగిట్టవు. దేహపరిశ్రమయు, క్రికెటు మున్నగు ఆటలు నా కంతకుమున్న లవాటు కానివి. నా బిడియమే నన్ను వీనికి దూర మొనర్చినది, ఆ యలవాటు చేసికొనమి దోసమని యిపుడు తెలిసివచ్చినది. దేహపరిశ్రమకు, విద్యార్జనకు సంబంధము లేదని ఆరోజులలో అనుకొంటిని.

దేహపరిశ్రమ మానుటచే నాకు వచ్చిన నష్టమేమియు లేదని కూడ చెప్పవలసి యున్నది. ఏల యన, గాలి బయలున చాల దవ్వు నడచుట మంచిదని నేను గ్రంథములందు చదివి, అట్లు నడచుట అలవాటు చేసికొంటిని. నేటికిని నేను దానిని విడువలేదు. ఆ యలవాటే నాకు దేహపాటవ మొసగినది.

ఇంటికడ మా యయ్యకు బరిచర్య సలుపవలెనను తీవ్రాభిలాషయే నన్ను బడిలోని దేహపరిశ్రమకు విముఖుని గావించినది. బడి ముగియగానే పరుగున నింటి కేతెంచి జనకపరిచర్యకు ఁడంగుచుంటిని. ఈ యుపచారపరతచే నాకు దేహపరిశ్రమ మెట్లును లభించుచునే యుండెను. జనక సపర్యకొఱకు నాకు బడిలో నిర్బంధ పరిశ్రమ మాన్పుడని శ్రీ గిమిని వేడికొన్నను ఆయన సమ్మతింపడాయెను. నే నొక శనివారపు టుదయమున బడి కేగి ఇంటికి వచ్చితిని. మధ్యాహ్నము బడి లేకున్నను దేహపరిశ్రమకోసము నాల్గుగంటలకు మరల బడి కేగవలసివచ్చెను. మింట మేఘములు క్రమ్మి నన్ను మోసగించెను. నాకు గడియారము లేకపోయెను. తీర, నేను బడికి చేరకమున్నే బాలురందరు వెడలిపోయిరి. మరునాడు శ్రీ గిమి హాజరుపట్టీ చూచి ''నిన్న నీవేల రాలే?''దని యడిగిరి. నేను ఉన్న యథార్థము చెప్పగా ఆయన విశ్వసింపక, ఒండో రెండో (నా కిపుడు జ్ఞప్తిలో లేదు.) అణాలు జరిమానా చెల్లింపుమనియెను.

నన్ను కల్లరీడనిరి కదాయని ఎంతయేని వ్యథ చెందితిని. నేను నిజమాడితినని నమ్మించుట కుపాయము కనుపించక బిట్టు దుఃఖించితిని. సత్యవాది జాగరూకుడై మెలగవలయునని నాకపుడు తెలిసివచ్చినది.

అది మొదలు నేనెన్నడు బడి పనులపట్ల అశ్రద్ధ చేసినది లేదు. ఆ జరిమానా కూడా నాకు తిరిగి యిచ్చివేసినట్లు లీలగా జ్ఞప్తికి వచ్చుచున్నది. బడి వదలగనే మా పిల్లవాని నింటికి పంపుడని మా జనకుడు స్వయముగా శ్రీ గిమికి వ్రాసి నాకు నిర్బంధ దేహపరిశ్రమ తప్పించెను.

శరీర వ్యాయామము మానుటచే నేను నష్టపడినది లేదుగాని, వ్రాలు కుదురకున్నను విద్యావృత్తకు లోపము కలుగదని నామనసులో నెట్లో పడుటచే నొదవిన లోపము నేటికి నట్లే యుండి తత్ఫల మనుభవించుచుంటిని.

నా చదువులబడినాటి ముచ్చటలు మరి రెండు చెప్పదగినవి కలవు. నా వివాహముచే నొకయేడు చదువు చెడెను. ఆ నష్టము కూడివచ్చుటకై అధ్యాపకుడు నన్ను పైతరగతిలో జేరుమనెను— కష్టించి చదువు బాలుర కీ సదుపాయము చేసెడివారు. కావున మూడవ తరగతిలో నే నారు మాసములు మాత్రము చదివి, వేసవి సెలవులకు మున్ను జరపు పరీక్షల యనంతరము నాలవకక్ష్యలో జేరితిని. నాలవకక్ష్యనుండి పఠనపాఠనము లాంగ్లభాషచే నడచుటచే నాకది క్రొత్తయై, కొరకుపడుట కష్టమాయెను. క్షేత్రగణిత మొకటి క్రొత్తగా నేర్పసాగిరి. నా కందు ప్రవేశము తక్కువగుటకు దోడుగా ఆంగ్లభాషాశ్రయ మొకటి వచ్చిపడి మరియు గష్టమనిపించెను. అయవారెంత చక్కగా బోధించినను అది నా మదికెక్కదాయెను. రెండేండ్ల చదువు నొక్కయేటనే నే నెట్లు మ్రింగనేర్తునని తరచుగా నధైర్యపడి, మరల మూడవ కక్ష్యలో జేరుట మేలనిపించెడిది. అట్లొనర్చినచో నా యవమానము నాకేగాక, నా

తెలివితేటలను నమ్ముకొన్న యొజ్జలకు గూడ ఘటిల్లును. ఈ రెండు అపప్రథలకోడి నే నున్నచోటును వదలకట్లే నిలచితిని. ఎట్లో కష్టించి యూక్లిడులో పదుమూడవ సూత్రమును చేరుసరికి నాకు గనువిప్పుగలిగి క్షేత్రగణిత సౌలభ్య మిట్టె గోచరించెను. కేవల బుద్ధిబలముచే సాధింపదగిన విషయమేదియు నిజమునకు గష్టముకాదు. అప్పటినుండి క్షేత్రగణితము సులభసాధ్యమై, దానియందు నాకు రుచి యేర్పడెను.

ఇక సంస్కృతభాష నాకు మరియు గష్టమనిపించెను. క్షేత్ర గణితమువలె గాక సంస్కృతము మొదటినుండి తుదివరకు కంఠ పాఠము చేయవలసినదిగా దోచెను. నాల్గవకక్ష్యలో గాని సంస్కృత పాఠ మారంభము కాదు. ఆరవకక్ష్య చేరుసరికి ధైర్యము చప్పగా గోలుపోతిని. సంస్కృతపు టొజ్జ మాకాభాష నెట్లైన నూరిపోయ వలెనను అభిలాష కలవాడు. అసడ్డ నేమాత్రము సహింపడు. ఆయనకు, పారసీమున్షీకి మధ్య కొంత స్పర్థ యుండెడిది. విద్యా ర్థులు పారసీకము నేర్చుట సులభమనియు, ఆ యుపాధ్యాయుడు మంచివాడనియు, మెత్తని వాడనియు చెప్పికొనుచుండెడివారు. ఆ భాషాసౌలభ్యమునకు లోగి నే నొకనాడు పారసీనేర్చు బాలురతో ఆ పాఠమున కేగితిని. సంస్కృతపు టయ్యవారది యెరిగి బాధ చెంది, నన్ను జేరబిలిచి, 'నాయనా! మీ తండ్రిగారు వైష్ణవులు కదా, మరి నీ వా మతభాషను నేర్వవలదా? నీ కేమేని కష్టము తోచినచో నన్నడుగవచ్చునుగదా, నేను శక్తివంచన సేయక మీకు బోధించుచుంటిని. ఈ భాషలో ఇంపైన విషయము లెన్నియున్నవో

ముందు ముందు నీకే తెలిసివచ్చును. అధైర్యమేల? మరల సంస్కృత పాఠమునకు రమ్ము, నామాట విను' మని బోధించెను.

వారి దయారసముచే నాకు సిగ్గొదవెను. అయ్యవారి ఆదరమును త్రోసివేయుటెట్లు? ఆ కొలదిపాటి సంస్కృతమైన నేనానాడు నేర్వకున్నచో మన మతగ్రంథములపై ఆస్థ కుదురుట దుష్కరమయ్యెడిది. ఆ భాషలో పాండితి సంపాదింపనైతినని నే నిపుడెంతయో వగచుచుందును. హైందవ బాలబాలిక లందరకు సంస్కృతమున మంచి ప్రవేశ ముండితీరవలెనని నా కిటీవల దెలిసివచ్చెను.

## వ్యాసరచనకు

1. విద్యార్థిగా నున్నప్పటి గాంధిజీ సత్యప్రియత్వమునకు తార్కాణలు వర్ణింపుము.

2. శ్రావణ హరిశ్చంద్రుల కథలు చెప్పి, వానిపై గాంధిజీకి ప్రీతి యేల కలిగెనో తెలుపుము.

3. గ్రంథములను వల్లించుటకంటె సచ్ఛీల మలవరచుకొనుట ఉత్తమముగా గాంధిజీ యెంచెను. అట్లెంచుట యుక్తమా? అగుచో ఎందువలన?

4. "సత్యప్రియునకు జాగరూకతవలయు" నని గాంధిజీ చెప్పెను. గాంధిజీ యభిప్రాయమును ప్రకరణోచితముగ విశదీకరింపుము.

# 3

# వివాహము

నాకు బదుమూడవయేట వివాహమైనది. ఇది చెప్పుట బాధగానున్నను చెప్పక తీరదు. ఇపుడు నాచెంత నా పాలనమందున్న ఈ బాలురను జూచి, ఈ యీడుననే నాకుం బెండ్లియగుట

దలచికొన్నపుడు నాపై నాకు జాలి పొడముచుండును. నా దురవస్థ వీరికి వాటిల్లనందున వీ రదృష్టవంతు లనిపించును. లేబ్రాయపు వివాహములను నైతికముగా సమర్థించుట కుపపత్తులు కన్పింపవు.

పెండ్లియనగా మంగళవాద్యములు, నూతన వస్త్రములు, ఊరేగింపులు, విందులారగించుటలు, క్రొత్తసావాసకత్తె లభించుటయు నను సంబరమే కాని అంతకంటె నా కేమియు దెలియదు. మా యిరువురకు క్రమముగా పరిచితి యేర్పడెను. మాటలు కలిసెను. ఇరువురము నొక్క యీడువారము. అయ్యో నేను వెంటనే పెనిమిటి పెత్తన మారంభించితిని.

నా యనుమతి లేనిదే భార్య యెచటికి బోరాదంటిని. కాని కస్తూరిబా చెంత ఈ పప్పులుడుకలేదు. ఎచటికేని, ఎప్పుడేని తనయిచ్చమై నేగుటయే యామె పనిగా బెట్టుకొనెను. నేను నిర్బంధించినకొలది ఆమె స్వతంత్రింపసాగెను. ఆమె స్వతంత్రించిన కొలది నాకు గోపము రెచ్చిపోవుచుండెను. నూత్న వధూవరులగు మాకు ఒండొరులకు మాటలు కట్టువడెను. పాపము, కస్తూరిబా అమాయికపు జిన్నది; నా యదుపును దాటింపమి యామె దోసము గాదు. సావాసకత్తెల యిండ్లకు, గోవెలకు బోరాదన్నచో ఆ యీడు బాలికలు మానుకొందురా? ఆమె నదుపుసేయు నధికారము నాకున్నచో నన్నును ఆమె అదుపుచేయవచ్చును గదా! ఇది యంతయు నాకిపుడు తెలిసివచ్చినదిగాని అపుడు పెనిమిటిమాట చెల్లి తీరవలెనను పట్టుదల యొక్కటే తెలియును.

మా దాంపత్య మిట్లు కలహములతోనె తెల్లవారె ననుకొందురేమో! కాదు: నే నామెపట్ల పారుష్యము వహించుచుటెల్ల ప్రేమ

పింపుననే. ఆమె యిల్లాండ్రకు మేలుబంతిగా నుండవలయునని నే నభిలషించితిని. ఆమె సుశీలయై, నా నేర్చినదెల్ల నేర్చి, మనో వాక్కాయములు నాతో నేకీభవింపవలెనని ముచ్చటపడితిని.

కస్తూరిబాయికి నంత్ర మట్టికోరిక యున్నట్లు తోచదు. చదువను వ్రాయను నేర్చినది కాదామె. అమాయికత్వము, స్వాతంత్ర్యము, పట్టుదలయు నామెకు సాజములు. నాతో నించుక బిడియపడుచుండెడిది. విద్యావతిని కావలెనన్న విచార మామెకు లేదు. నా విద్యావ్యాసంగముచే నామె కట్టి వ్యాసంగమునకై వాంఛయు జనింపలేదు.

వ్యాసరచనకు

కస్తూరిబా గాంధజీల నూతన దాంపత్యమును నీ సొంతమాటల వర్ణింపుము.

## 4

## దుస్సాంగత్యము

హైస్కూలులో నాకున్న మిత్రులే కొలది; వారిలో వేర్వేరు సమయములం దిద్దరితో గాఢమైత్రి యేర్పడెను. అందు మొదటిది చిరకాలము నిలువలేదు. దానినైనను నేను వదలుకొనలేదు. రెండవ మిత్రముతోడి నా చెలిమి మొదటివానికి గిట్టక ఆతడు నన్ను విడనాడెను. చిరకాలము మనిన ఈ రెండవ మైత్రిచే నా బ్రదుకు బండలాయెను. సంఘసంస్కార ప్రేరితుడనై నే నా స్నేహము చేసితిని.

ఈతడు తొలుత నా చిన్నయన్నకు స్నేహితుడు. వారిరువురు సహాధ్యాయులు. ఆతని లోపము లెరిగియు, విశ్వాస్యుడని యెంచి చెలిమి చేసితిని. మా యమ్మయు, మా యన్నయు, నా భార్యయు 'నీ కీ దుస్సహవాసము వల' దని చెప్పిరి. ఆలిమాట నే నభిమానముచే సరకుసేయకున్నను మా యమ్మను, నన్నను గాదనలేను. వారిని సమాధానపరచుటకై 'మీరు చెప్పిన దోషము లాతనిలో లేవనుగాని కొన్ని సుగుణములుగూడ ఆతనియం దున్నవి. నే నాతని చక్కదిద్దుటకై మైత్రి నెరపుచుంటినిగాన నన్నాతడు చెడ త్రోవను బెట్టలేడు. మంచివారికి వచ్చినచో ఆతనివంటి ఉత్తముడు మరియుండడు. కావున నాకై అలజడి చెందకుడు' అని చెప్పితిని.

ఈ మాటలు వారికి నచ్చకున్నను నాదారిని నన్ను బోనిచ్చిరి. ఆతనితో నాకు బరిచితి ఏర్పడునాటికి రాజకోటలో సంస్కారవాయువులు వీచుచుండెను. మా గురువులలో జాలమంది చాటుమాటున మద్యమాంసములు సేవించుచుండిరని ఆతడు నాతో జెప్పెను. రాజకోటలో మరికొందరు పెద్దలకుగూడ నీయలవా టున్నదని వారిని జేర్కొనెను. మా హైస్కూలు బాలురు కొందరుగూడ నందు జేరి రని చెప్పెను.

ఈ మాటలచే నే నాశ్చర్య విషాదభరితుడ నైతిని. వారిట్లు జేయుటకు గారణమేమి యని యడుగగా నాత డిట్లు వచించెను. 'మాంసము తినకుంటచే మనము దుర్బలులమైపోతిమి. మాంసభక్షకులగుటచే ఆంగ్లేయులు మనకు బాలకులు గాగలిగిరి. నా దార్ఢ్యము నీ వెరుగుదువు. పరుగులో నా కెవరును దీటురారు. మాంసభక్షణమే ఇందులకు గారణము. ఎరచి దినువారికి కురుపులు పుట్టవు.

పుట్టినను త్వరగా మానిపోవును. మాంసము దినుచున్న మన గురువులు, తక్క పెద్దలు బుద్ధిహీనులు కారుగదా. దాని గుణ మెరిగియే తినుచుండిరి. నీవును తిని చూడుము. ప్రయత్నము వంటిది మరియొకటి కాదు. తినినపై నీకే తెలియును, అది యెట్టి బలము నొసగునో.'

ఈ హేతువులన్నియు ఒక్కనాడే చెప్పినవి కావు. తన మతము నాకు మప్పుటకై ఎడపదడప నాతడు నాతో జెప్పుచువచ్చిన మాటల సారమిది. అంతకుముందే యిందు దిగిన మా చిన్నన్న ఈతని వాదమును సమర్థించెను. మా చిన్నన్నయు, నాతడు నిజము నకు దృఢకాయులు, బలశాలురు, సాహసులు. వారిముందు నాది పిట్టచూపు. ఈ స్నేహితుని సాహసకృత్యములు నన్ను ముగ్ధుని జేయుచుండెడివి. ఆతడు రివ్వున కడుదవ్వు పరుగిడగలడు. ఎత్తుగా నెగురుటలో, దవ్వు దుముకుటలో నాతని వందవేసిన చేయి. ఆతని శరీర మెంతటి శాధనైన సహించును. ఆతడు తరచు తన వీర కృత్యములు నాకు జూపెట్టెడివాడు. తనకులేని గుణము లితరుల యందు చూచి రిచ్చవడుట నైజముగాన నేనీ చెలికాని శక్తి కచ్చెరు వందితిని. నేను పరుగిడలేను; దుముకనులేను. కావున నేనుగూడ ఆతనియంతవాడను గావలయునను వాంఛ నాకు గాటముగా జనించెను.

నేను వట్టి పిరికివాడను. దొంగలు, భూతములు, పాములు అన్నచో నాకు దగని భయము. రాత్రులందు గడపదాటి పోలేను. చీకటిలో నాకు ప్రాణము లెగసిపోవును. చీకటిలో పండుకొన్నచో ఆ మూలనుండి దొంగలో, ఈ దెసనుండి భూతములో, మూడవ వైపునుండి పాములో వచ్చుచున్నవని మనసు ఆరాటపడుచుండును.

కావున దీపము లేని గదిలో నేను నిద్రపోలేను. నా యీ దౌర్బల్య మెల్ల నాత డెఱిగినదే. బ్రదికియున్న పాములను జేతబట్టుకొందు ననియు, దొంగలనిన దనకు లెక్కలేదనియు, భూతములపై నమ్మకము లేదనియు నాతో జెప్పెడివాడు.

ఇక నేమున్నది? ఈ మాటలన్నియు చేయవలసిన పని చేసి, నన్ను లోగొన్నవి. మాంసాశనము మంచిదనియు, దానిచే నాకు ద్రఢిమయు, సాహసము చేకురుననియు, ప్రజలందరు మాంసము దిన్నచో ఆంగ్లేయులను జయింపవచ్చుననియు నాకు దోచనాగెను.

ఈ ఘనకార్య మొనర్చుటకై సుముహూర్తము నిశ్చయించితిమి. నా జననీజనకులు వైష్ణవులు; నాకు వారియెడ నమిత భక్తి. కావున ఈ పని చాటుగా జరగవలెను. పలల భక్షణ మారంభించినచో నది నా తల్లిదండ్రుల మోసగించుటే యగునని నాకు దెలియదందునా? అనలేను గాని 'సంస్కార' మను భూతము నన్ను బట్టుకొనెను. జిహ్వాచాపల్యముచే నే నిందు దిగినవాడగాను. మాంసము రుచిగా నుండుననియు నే నెరుగను. నేను దృఢ శరీరుడను, ధీరుడను కావలయును; నా దేశప్రజలెల్ల నట్టివారు కావలయును — ఇదియే నాకు బట్టిన సంస్కారావేశము. దీనిచే గ్రుడ్డినై పోయితిని. ఈ రహస్యము పొక్కదు గావున తల్లిదండ్రుల కనుమొరగుట సత్యవ్రత భంగము కాజాలదని సమాధాన పడితిని.

సుముహూర్తవేళ ఏటియొడ్డున ఏకాంత ప్రదేశమున కేగితిమి. అచ్చట తొలిసారిగా నాకు మాంసము బ్రత్యక్షమైనది. కల్లు రొట్టె కూడ దాని సరసనున్నది. ఆ రెండును నాకు రుచించినవి కావు.

త్రోలువలె బిరుసుగానున్న ఆ మేకమాంసము నేను నములలేక పోతిని. ఓకిరింత జనించి వదలి వేసితిని.

నాటిరేయి నా పడిన యవస్థ ఏమిచెప్పుదును! ఇంచుకంత కునుకు పట్టగనే కడుపులో మేక యరచుచున్నట్లు ఒకటే పీడకల. త్రుళ్ళిపడి లేచుటతో, చేసిన పాడుపని కేన్పుటతో నాకు దెల్ల వారెను. తెలివి వచ్చినపుడెల్ల మాంసాదనము విహితధర్మ మని ఊరట చెందితిని.

నా మిత్రము తేలికగా వదలిపెట్టెడి ఘటము కాదు కావున పలలముతో బలురకముల పిండివంటలు చేయసాగెను. ఏటియొడ్డున చాటు చోటు వదలిపెట్టితిమి. దివాణపు భవనమునందలి ముఖ్య వాచకుని నా స్నేహితుడు కూడగట్టుకొనుటచే అచటి కుర్చీలలో గూరుచుండి, మేజాబల్లపై భుజింపసాగితిమి.

క్రమముగా గల్లు రొట్టెపై నా యేవము జారిపోయెను; మేకలమీది జాలి సన్నగిలి, మాంసపు బిండివంటలు—తుదకు మాంసమే రుచింపదొడగెను. ఈ రీతిగా నొక వత్సరము సాగినను మొత్తము మీద మాంసపువిందు లయిదారుకంటె అధికముగా జరుగలేదు. ఈ 'సంస్కారమును' నిలుచుటకు నాచెంత సొమ్ము లేదుగాన నా నెయ్యుడే దానిని సంపాదింపవలసి వచ్చెను. అత డెచట దెచ్చె వాడో నే నెరుగను. నన్ను పలల భక్షకునిజేయు పూనికమై నత డెట్లో సొమ్ము సంపాదించి తీరెడివాడు. ఆతని శక్తి కేనియు మితి యుండును గావున కొంతకాలమున కావిందులు ఎడపదడప సకృత్తుగా నమర జొచ్చెను.

ఈ చాటు విందులు సాగిన నాళ్ళ నింటికడ తిండితినుట అశక్య మయ్యెడిది. భుక్తివేళకు మాయమ్మ నన్ను బిలుచుటయు, 'ఏల తినవు' అని యడుగుటయు వటస్థించెడిది. 'నేను జీర్ణశక్తి బాగుగా లేదు; ఆకలి యగుట లే' దని చెప్పెడివాడను. నే నసత్యమాడు చుంటిననియు, మా యమ్మతో నాడుచుంటిననియు నెరుగుదును. నేను మాంసఖాదినై తినని మా యమ్మకు, నయ్యకు దెలిసినచో వారికి గుండెలు వ్రయ్యలగుననియు నెరుగుదును. ఈయాలోచనతో నా మనసు కళవళపడసాగెను.

'మాంసము తినుటయు దప్పదు. ప్రజల భోజన పద్ధతి సంస్కరించుటయు దప్పదు. నిజమేకాని, మాంసము దినుట గురుజన వంచనముకంటె అపరాధము కానేరదు. కావున వారు బ్రతికి యుండగా మాంసము దినుట విడువదగును. వారి యనంతరమున నేను స్వాతంత్ర్యుడనైన పిమ్మట బహిరంగముగనే మాంసము తిందును. అందనుక దాని జోలికి బోను' అని నిశ్చయించు కొంటిని.

నా చెలికానికీ నిశ్చయ మెరిగించితిని. తిరిగి నే నెన్నడు మాంసమును ముట్టలేదు.

### వ్యాసరచనకు

1. మాంసభోజనము మంచిదని గాంధిజీ ఎంచుటకు గారణము లెవ్వి?

2. గాంధిజీ మాంసము నేల వర్జించెను?

3. ఆలోచింపక స్నేహము చేయరాదు. ఎందువలన? ఈ ప్రకరణము నందలి గాంధిజీ అనుభవములచే దీనిని తార్కాణింపుము.

# 5

## చౌర్యము

నా వివాహమగుట కించుకముందు వెనుకలుగా, ఈ మాంస భక్షణ సమయమందును, అంతకు బూర్వమందును నా యొనర్చిన తప్పిదములు మరికొన్ని చెప్పవలసియున్నవి.

నా బంధు వొకడును, నేనును పొగ(త్రాగుట)కై మనసు పడితిమి. పొగపీల్చుట మంచిదనియు గాదు, సిగరెటు వాసనపై ఇష్టముండియు గాదు. నోటినుండి పొగమబ్బులు కల్పించుట సరదాగా నుండెడిది. మా పినతండ్రి పొగపీల్చుట చూచి మేమును మొదలు పెట్టితిమి. కాని, మాకడ పైకము లేదుగావున మా పితృవ్యుడు కాల్చి పారవైచిన సిగరెట్టు పీకలను సంగ్రహించుచుంటిమి.

ఆ పీక లెల్లప్పుడు దొరకెడివి కావు. దొరకినను వానినుండి పొగవచ్చుట అంతంతమాత్రమగుటచే మేము చల్లగా మా నవుకరుల జేబులనుండి కానిడబ్బులు దొంగిలించి, నాటుచుట్టలు కొనసాగితిమి. వానిని దాచిపెట్టుట పెద్ద చిక్కయ్యెను. పెద్దల యెదుట పొగ త్రాగ తగదాయెను, ఆ దొంగడబ్బులతో గొన్నాళ్ళట్లో గడపితిమి. ఇంతలో, గొన్ని మొక్కల దంట్లు సిగరెట్లవలె పీల్చవచ్చునని తెలిసెను. అంతట వానిని సంపాదించి పొగ పీల్చసాగితిమి.

ఈ చాటు మాటు పొగపీల్పులు మాకు దృప్తినీయవాయెను. మనకు స్వేచ్ఛ లేకపోయెగదాయని దురపిల్లితిమి. పెద్దల యనుమతి లేకుండ నేమి చేయుటకును వలనుపడమి దుస్సహామనిపించెను. ఈ పరాధీనపు బ్రదుకుచే విసివి, తుదకు ఆత్మహత్యకు సిద్ధపడితిమి.

ఆత్మహత్య కుపాయమేది? నాకు విష మెచట దొరకును? అని యాలోచించితిమి. ఉమ్మెత్తగింజలు తిని చావవచ్చునని విని యుంటచే నడవిలోనికేగి వానిని సంపాదించి తెచ్చితిమి. సాయం సమయము సుముహూర్తమని యెంచి, ఆ వేళకు కేదారనాథుని మందిరమున కేగితిమి. అచట దీపారాధన మొనర్చి, స్వామిదర్శనము చేసికొని, ఒంటరిపాటు చూచుకొంటిమి. తీర, సమయమునకు ధైర్యము చాలకపోయెను. ఒకవేళ ఈ విషము వెంటనే చంపకున్నచో నేమగును? అను ఆలోచన పొడమెను. ఇంతకు బ్రాణములు దీసికొన్నచో నేమిప్రయోజనము? స్వేచ్ఛ లేకున్నచో నేమాయె? అనుకొనుచు నెట్లో రెండుమూడు గింజలు మ్రింగితిమి. అంతకుమించి తెగింప లేకపోతిమి. చావనిన భయముపుట్టెను. అంతట నిరువురము రామస్వామి మందిరమున కరిగి, మనసు కుదుటపరచుకొని, ఆత్మహనన విచారము నుజ్జగించితిమి.

చేసేత ప్రాణములుదీసికొనుట చులకనగాదని నాకు దెలిసివచ్చెను. మా యాత్మాహనన యత్నమంతయు తుదకు ధూమపానమునకు, పరిచారకుల డబ్బులు దొంగిలించుటకు స్వస్తిచెప్పుటతో నంతమయ్యెను.

నాకు బుద్ధి తెలిసినపిమ్మట మరల ధూమపానముపై గోరిక పుట్టలేదు. పొగపీల్చుట అనాగరకము, హానికరము, అసహ్యము నని యెంచుకొంటిని. లోకమంతట నీ పొగపీల్పుపై నింతటివ్యసన మేటికో నాకు దెలిసినదికాదు. రైలు ప్రయాణములలో నందరు గుప్పుగుప్పున పొగపీల్చి వదలుచుండగా నా కూపిరియాడదు.

ఆ పిమ్మట నేను మరియొక ఘోరచౌర్యమున కొడిగట్టితిని. రాగిడబ్బులు దొంగిలునాటికి పదిరెండు పదుమూడేండ్లుకూడ నాకు

లేవేమో. ఈ రెండవ చౌర్యమునాటికి పదునై దేండ్లవాడ నైతిని. మాంసభక్షకుడగు నా యన్న చేతి కడియమునుండి చిన్న పైడి ముక్క తెక్కలించుటకు పాల్పడితిని. ఈ యన్న పాతిక రౌప్యము లప్పుచేసెను. ఆతని చేతికి గట్టి బంగారు కడియమున్నది. దాని నుండి చిన్న ముక్క తెగగొట్టుటన్న నొక కష్టమైన పనిగాదు.

ఆపనియేమో జరిగెను. అప్పును తీరినది. కాని నా చేసిన పాడుపనిచే దుర్భర వేదన ఘటించెను. ఇక నెన్నడు తస్కరింపనని నిశ్చ యము చేసికొంటిని. ఈ చేసిన పాపము మా తండ్రికి జెప్పివేయవలె ననికూడ ఎంచితిని. కాని చెప్పుటకు ధైర్యము చాలలేదు. మా తండ్రి నన్ను దండించునను భీతిచేగాదు. ఆయన మాపై నెన్నడు చేయిచేసుకొన్నవాడు కాడు. చెప్పినచో ఆయన హృదయ మెంత ఘూర్ణిల్లునో యని భయపడితిని. ఏది యెట్లైనను చెప్పక తీరదను కొంటిని. చేసిన పాపమునకు జెప్పుటయే నిష్కృతి యని యెంచితిని.

నే చేసిన పాప మంతయు తండ్రికి వ్రాసియిచ్చి వారి క్షమ నర్థించుటకు బూని, దాని నొక కాగితముపై లిఖించి, స్వయముగా జనకుని చేతి కిచ్చితిని. నా పాపము నొప్పికొనుటయేకాక, దానికి తగిన దండనము విధింపుడనియు, ఈ కుపుత్రుని యపరాధమునకు మీరు వ్యథనొందకు డనియు నందు వారిని వేడికొంటిని ఇకమీద నెన్నడు నిట్టి చౌర్యము చేయనని బాసచేసితిని.

ఆ కాగితము జనకున కొసగునపుడు నేను నిలువున వణకి పోతిని. పట్టెబల్లపై పండుకొని, కదలుట కశక్తుడైయున్న తండ్రి చేతి కా చీటీ నొసగి ఎదురుగా గూరుచుంటిని.

దానిని చదువుసరికి వారి కనుల బాష్పము లురలి, కాగిత మును దడుపజొచ్చెను. ఆయన యొక్క నిమేషము నిమీలిత నయనుడై యుండి ఆ చీటిని జింపివైచెను, దానిని చదువుటకై లేచి కూరుచున్నవాడు మరల వెనుక కొరగెను. నేనును ఏడువజొచ్చి తిని. జనకుని వ్యథ నా కనుల గట్టినట్లుండెను. చిత్రలేఖనము నేర్చియున్నచో నిప్పుడుగూడ ఆ దృశ్యమును జిత్రింపగలను. నా హృదయమున నేటికి నది యచ్చునగ్రుద్దినట్లున్నది.

ప్రేమపూరితములగు ఆ బాష్పములు నా హృదయమును కడిగివైచి, నా పాపమును క్షాళిత మొనర్చెను.

సాజముగా నూతండ్రి ఇంతటి క్షమాశీలుడు కాడు. కోప వివశుడై, పరుషోక్తులాడి, తలపై బాదుకొను ననుకొంటిని. నేను పాపము నొప్పికొనుటయే అపురూపమగు అంతటి శాంతిని వారికి గూర్చెను. దండించు నధికారిచెంత పాపము నొప్పికొని, ఇక నట్టి పని చేయనని మాటయిచ్చుటయే అచ్ఛమగు ప్రాయశ్చిత్తము. నా యీ ఒప్పుదలచే మా తండ్రికి నన్నుగూర్చిన బెంగ తీరిపోవుటయే కాక నాయెడ బ్రీతియు వారి కధికమయ్యెను.

వ్యాసరచనకు

1. పొగ పీల్చుటనుగూర్చి గాంధిజీ అనుభవమును వివరింపుము.

2. గాంధీజీ తన పాపము నొప్పికొనుటచే (ఎ) వారి జనకునిలో (బి) గాంధిజీలో కలిగిన మార్పులకు గారణము నీకు తోచినట్లు వ్యాఖ్యానింపుము.

3. గాంధిజీ ఆత్మహత్య కేల పూనెను, ఏల మానెను?

# 6

## పితృ వియోగము

నాకప్పుడు పదియారవ యేడు. మా తండ్రి అప్పటికే మంచ మెక్కెను. మా యమ్మయు, నేనును, మా యింటి వృద్ధ పరిచారికయు ఆయనకు పరిచర్య చేయుచుంటిమి. ఆయన కురుపునకు కట్టు కట్టుటయు, వేళ కౌషధ మిచ్చుటయు నా వంతు. రాత్రు లాయనకు నిద్రపట్టుదనుకను. లేదా, 'ఇక జాలునులె' మ్మను వరకును పాదములొత్తి, పిమ్మట నిమురించెడివాడను. ఆ పరిచర్య యన్న నా కెంతో యిష్టము. దాని నెన్నడు మానినట్లు గురుతు లేదు. నా నిత్యకృత్యములకు పోగా మిగిలిన కాలము బడి పనులకును, పితృసేవకును సరిపోయెడిది. ఆయనకు గొంచెము తేలికగా నుండి, అనుజ్ఞ యిచ్చినచో నెపుడైన సంజవేళ వాహ్యాళి కేగి వచ్చెడివాడను.

ఆ కాళరాత్రి వచ్చెను. 10–30 లో 11 గంటలలో ప్రొద్దు పోయెను, నేను పాదసంవాహన మొనర్చుచుంటిని. నంతు మార్పిడికి మా పినతండ్రి రాగా నేను బోయి శయనించితిని. మరి అయిదారు నిముసములలో పరిచారకుడు వచ్చి నాతలుపు దట్టెను. నేను కళవళపడి లేచితిని. 'బాబయ్యగారికి బరువుగా నున్నది, రండు' అనెను. వ్యాధి అధికముగా నున్నదని నే నెరిగినదియే కాన 'బరువుగా నున్న' దనగనే అందలి యర్థము తెలిసిపోయినది. తటా 'లున మంచము డిగ్గనురికి 'ఏమైనది? చెప్పు' మని యడిగితిని 'బాబయ్యగారు మరి లేరు' అనియెను.

అంతయు ముగిసినది. తుదివేళ చెంత లేకపోతినిగదా యని చాల దుఃఖించితిని.

వ్యాసరచనకు

గాంధిజీ తండ్రిగారికి నే యే భంగుల సేవించెను?

## 7

## ధర్మ పరిచయము

దయ్యములు, భూతము లన్నచో నాకు భయమని మున్నె చెప్పితిని. రామనామము జపించినచో ఆ భయము పోవునని రంభ యను నా దాది ఉపదేశించెను. రామనామ ప్రభావముపైకంటె రంభపై నా కెక్కుడు విశ్వాసముగావున భీతిహరణమునకై పిన్న నాటనే రామనామస్మరణ మారంభించితిని. ఆ స్మరణము పెద్ద కాలము నిలువలేదుగాని చిననాడు విత్తిన ఆ బీజము ఊరక పోలేదు. ఆ యుత్తమురాలు, రంభ ఆనాడు నాటిన విత్తనమువలననే నేడు రామనామము నాకు తారకమంత్ర మైనది.

వ్యాధిగ్రస్తుడగు మాయయ్య పోర్బందరులో కొంతకాల ముండెను. సాయంవేళల ఆయన రామాయణ శ్రవణ మొనర్చెడి వాడు. రామభక్తుడగు పౌరాణికుడు చక్కని కంఠమెత్తి అభంగ ములు పాడుచు, రామకథా వివశుడై వ్యాఖ్యానించుచుండ శ్రోతలు మైమరచెడివారు. అప్పటికి నాకు పదమూడేళ్ల వయసున్నదేమో. ఆయన పురాణ కథనముచే నేను వివశుడ నగుచుంటిని. రామా యణమునెడ నా భక్తి కదియే మూలము. తులసీదాస రామా యణమువంటి ధర్మగ్రంథము మరి లేదని నేడు నే ననుకొందును.

హైందవ ధర్మమందలి భిన్న శాఖలను, ఇతర మతధర్మములను ఆదరముతో గనుట నాకు రాజకోటలో నుండగా అలవడెను. మా తలిదండ్రులు హవేలీకి, శివుని గుడికి, రాముని గుడికిగూడ నేగెడివారు. పిల్లలము మమ్మును వెంట గొనిపోయెడివారు. జైన సన్యాసులు తరచు మా యయ్యకడకు వచ్చుచుంటయు, మేము జైనులము కాకున్నను వారు మాయింట భిక్ష గ్రహించుటయు గద్దు. వారు మా జనకునితో ధర్మప్రసంగము లొనర్చుటయు, ఇతర వ్యవహారములు మాటలాడుటయు గద్దు.

మిత్రులగు ముసల్మానులు, పారసీకులును వచ్చి తమతమ ధర్మముల గూర్చి ప్రసంగించుచుండ మాయయ్య సగౌరవముగ, సాదరముగ వినెడివాడు. నేను ఆయనకు బరిచర్య సల్పుచు నొద్ద నుండి ఆ మాటలు వినుట లభించెను. ఇదియెల్ల కారణముగా నాకు సర్వధర్మ సమాదరము అలవడెను.

క్రైస్తవమత మొక్కటే నాకు గిట్టకుండెడిది. దాని యెడ నా వైముఖ్యమునకు గారణమున్నది. ఆ కాలమున క్రైస్తవమత ప్రచారకులు హైస్కూలు చెంత నిలిచి హైందవులను. వారి వేల్పులను దెగనాడుచుండిరి. నే నది భరింపలేకపోతిని. సుప్రసిద్ధుడగు ఒక హైందవుడా నాళ్ళలోనే క్రైస్తవమత ప్రవిష్టుడగుట విననయ్యెను. మతస్వీకార వేళ ఆయన గోమాంసమును దిని, మధుపాన మొనర్చె ననియు, నాటినుండి తొల్లిటి వేసము వదలి ఐరోపీయుల దుస్తులను, టోపీని ధరింపజొచ్చెననియు బురవాసు లెల్ల జెప్పికొన దొడగిరి. ఆ క్రొత్త బిచ్చగాడు అప్పుడే తన పూర్వధర్మములను, సంప్రదాయములను, మాతృభూమిని గూడ చెడనాడ సాగెననియు వింటిని.

ఇతర మతములందు నాకిట్లు సమభావము కలిగినదన్నంతనే ఈశ్వరునిపట్ల శ్రద్ధాభక్తులు కుదిరినవని యెంచగూడదు. ఈ సృష్టికి నీతియే మూలమనియు, సత్యమే సర్వనీతిసారమనియు — ఈ విశ్వాసము మాత్రము నాలో వేరుదన్నికొన్నది.

గుజరాతి సుభాషిత మొకటికూడ నామనసున నాటికొన్నది. 'అపకారికి ఉపకారము చేయుము' అను అందలి సూత్రము నా బ్రదుకునకు చుక్కానైనది. దాని యర్థము నన్నావేశింప తదనుగుణముగా చరించుటకై యత్నము లారంభించితిని.

ఇదిగో, ఆపద్య మిట నుదాహరించుచున్నాను.

పుడిసెడు నీళ్ళీయ, కడుపెడన్న మొసంగు,
అభివాద మొనరింప, నవని జాగిలి మ్రొక్కు
రాగిడబ్బీయ, స్వర్ణము మాపోసంగును
ప్రాణదాతకు నిజప్రాణమ్ము లర్పించు
గోరంత మేల్సేయ, గొండంత ప్రతిసేయు
నయవిదుడగువాని నడవడి యిద్ది
అందర నొకభంగి నరయు ధన్యాత్ము
డపకారికిం బేర్మి నుపకృతి సల్పు.

వ్యాసరచనకు

1. గాంధిజీ దాదియగు రంభ వారికేమి ఉపదేశించెను? ఈ త్రిర వయస్సున వారి కది యెట్లు ఉపకరించెను?

2. రామాయణముపట్ల గాంధిజీ తలంపెట్టిది? చిన్ననాటనే వారి కా తలపు ఎట్లు కలిగెను?

3. అన్యమతముల పట్ల చిన్ననాట గాంధిజీ తలపు లెట్టివి? అందులకు గారణము లెవ్వి?

4. జీవితపర్యంతము వారి కట్టి తలపే యున్నదా? వారి ప్రార్థనలను, భజనలను గూర్చి నీవు దెలిసిన దానిని తారకాణ యొనర్పుము.

5. సార్వకాలికముగ ఆచరింపదగిన ధర్మసారమును గూర్చి గాంధిజీ ఏమి చెప్పెను?

## 8

## ఇంగ్లాండు ప్రయాణమునకు సన్నాహము

స్కూలు చదువు ముగిసినంతనే నన్ను గురుజనము కళాశాలలో చేరుమనెను. బొంబాయిలో, భావనగరములో కళాశాలలున్నవి. వానిలో రెండవదానియందు వ్యయము తక్కువగునుగాన నేనందు శ్యామలదాస కళాశాలలో చేరితిని. ఆరునెలలు ముగియుసరికి నాకా చదువు గష్టమనిపించుటచే మానుకొని ఇల్లుచేరితిని.

మావుజీదేవు అను బ్రాహ్మణపండితు లొకరు మా కుటుంబమునకు చిరమిత్రము. ఆయన లోకజ్ఞుడు. మా తండ్రి యనంతరమునగూడ మా క్షేమ మరయుచుండెడివాడు. నేను సెలవులలో ఇంటికడనుండగా ఆయన ఒకనాడు వచ్చి మా యన్నతో, అమ్మతో బ్రసంగించుచు నా చదువుసంధ్యలను గూర్చి విచారించెను. నేను శ్యామలదాస కళాశాలలో చేరితినని విని ఆయన యిట్లనెను. "కాలమిపుడు మునుపటివలె లేదు. నాయనగారి దివాన్గిరి మీరు చేపట్టవలెనన్నచో దానికి దగిన విద్యాబుద్ధులు సంపాదింపవలెను. ఈ చిన్నవాడింకను చదువుచున్నాడుగాన, ఏనాటికైన తండ్రిగారి

సీమ నీకంతడే ఎక్కువని ఆశకలదు. కళాశాలలో నీతడు బి. ఏ. పట్టము పుచ్చుకొనవలెనసిన మరి నాలుగేండ్లు పట్టును. అప్పటికేని ఏ యరువది జీతపురాళ్ళ యుద్యోగమో కొరకునేకాని దివాన్గిరి లభింపదు. నా కుమారునివలె నీతడుగూడ ప్లీడ రగుట మంచిదే కాని అందులకు మరియు ఆలస్యమగును. అప్పటికి దివాన్గిరి కొరకు లాయర్లు కోకొల్లలుగా సిద్ధమగుదురు. కావున ఈతని సీమ కంపుట మేలు. సీమ కేగివచ్చిన ఆ శారిష్టరును, ఆతని ఠీవిని చూడుడు. కోరవలెనుగాని దివాన్గిరి ఆతని కాళ్ళకడకు వచ్చును. కావున ఈ మోహనదాసు సీమకంపుడు. అచట మా కేవలరాము స్నేహితు లెందరో యున్నారు. వానివలన పరిచయ పత్రములు తీసికొని యేగినచో సీమలో నీతడు సుఖముగా కాలక్షేపము చేయవచ్చును'.

ఇట్లు చెప్పి జోషిజీ—(ఆ వృద్ధబ్రాహ్మణుని మేమట్లు పిలుచు చుంటిమి) నాతో 'ఏమి మోహన్, నీవు సీమ కేగుదువా, ఇచటనే చదివికొందువా ?' అనెను. ఇచట చదువు నాకు గష్టమనిపించు చుండెనుగాన నేనా మాట కెగిరి గంతువైచి 'అంతకంటె గావలసిన దేమి ! సీమ కెంత తొందరగా బంపిన అంత మంచిది' అంటిని. మా యన్న 'వీనిని సీమకంపుట కంత ద్రవ్య మెక్కడనుండి వచ్చును ? కుఱ్ఱవాని నొంటిగా దూర దేశములకు బంపుట యెట్లు ?' అను ఆలో చనలో బడెను. మా యమ్మ నన్ను వదలియుండనేరక మొదలే కళవళపడజొచ్చెను. ఆమె మెల్లగా వారిని—వీరిని అడగిచూచెను. కొందరు 'సీమ కేగిన పడుచువాండ్రు తిరిగివత్తురా ?' యనిరి. 'అచట మాంసము దినవలసియుండు'నని కొందరు, 'సీమలో మద్యము సేవింపనిచో బ్రదుకలేరట' యని కొందరు చెప్పసాగిరి. ఆమె 'ఏమిరా, నాయనా !

అందరు ఇట్లు చెప్పుచున్నారు' అని నన్నడిగెను. నేను 'అమ్మా! నన్ను నమ్మలేవా! నే నవి యేవియు ముట్టను. నీతో కల్ల లాడుదునా?' యంటిని. 'అట్టి ప్రమాదమున్న చో జోషిజీ మాత్రము నన్ను వెళ్లుమనునా?' యంటిని.

'నిన్ను నమ్మలేక కాదు. దూర సీమలందున్న వానిని నమ్మి యుండుటెట్లు? నాకేమి చేయుటకును తోచకున్నది. ఐనను, బేచార్జిస్వామి యేమి చెప్పునో అడిగి చూతును' అనెను మాయమ్మ.

ఆ స్వామి మొదలు మోఢవైశ్యుడేగాని ఇపుడు జైనభిక్షుకు డయ్యెను. జోషిజీవలె మాకు శ్రేయస్కామి యగు ఆయన 'భయపడకుడు. ఈ కుఱ్ఱవానిచే మూడు శపథములు చేయింతును. పిమ్మట నిశ్చింతమై ఈతని బంపవచ్చు' నని చెప్పి నన్నాదుకొనెను. 'మద్యమాంసములను, మగువను ముట్ట' నని నేను శపథ మొనర్చి నంతట మాయమ్మ నా పోకకు సమ్మతించెను.

రాజకోటనుండి కుఱ్ఱడొకడు సీమ కేగుట యపురూపము గావున ఈ ఘనకార్యము చేయుచున్న నన్ను వీడ్కొలుపుటకు హైస్కూలులో సభకూడెను. నే నేవియో నాలుగు కృతజ్ఞతా వాక్యములు వ్రాసి చదువబోవగా నాకు నిలువెల్ల కంపము జనించి, తలత్రిప్పు పుట్టి, నోట మాట వెడలదయ్యెను.

మా యమ్మ యనుజ్ఞను, ఆశీర్వాదమును తలదాల్చి, పసి గ్రుడ్డు తోడి బాలెంతను నా యిల్లాలిని వీడ్కొలిపి, సంతోషముతో బొంబాయికి పయనమైతిని. బొంబాయికి చేరినంతట మా యన్న స్నేహితులు జూను, జూలై మాసములలో దక్షిణ మహాసముద్రము

సంక్షుభితమై యుండునుగాన క్రొత్తగా సముద్రయానము చేయనున్న నన్ను నవంబరు నెలలోగాని పంపవలదని హితము చెప్పిరి.

ఇంతలో మా కులమువారు నా సముద్రయానమును గూర్చి గందరగోళము పడిరి. కుల పెద్దలందరు రచ్చదీర్చి నన్ను బిలిపించిరి. నా కంతటి ధైర్య మెట్లు కలిగెనో ఎరుగను గాని నిర్భీకుడనై వారి యెదుట నిలిచితిని. సభాపతియగు సేటు మాకు దూర బంధువు, మా యయ్యకు గావలసినవాడు. ఆయన యిట్లడిగెను.

'మన కులస్థులు నీ సీమ ప్రయాణము అయుక్తమనుచున్నారు. ద్వీపాంతరయానము మనకు నిషిద్ధము. అచటి కేగిన పై కులభ్రష్టత తప్పదని మేము వింటిమి. తెల్లవాండ్రతో పంక్తిభోజనమును పానమును అచట తప్పవట. ఇందుల కేమందువు ?'

నే నిట్లంటిని. 'సముద్రయానము మన మతమునకు విరుద్ధమని నాకు తోచుటలేదు. నే నచట చదువుకొనుట కేగుచుంటిని. మీరు భయపడుచున్న మూటిని ముట్టనని మాయమ్మతో నే నింతకు మున్న శపథ మొనర్చితిని. ఆ శపథమే నన్ను గాపాడగలదు.'

అంతట నా సేటు 'నీ కచట మతభ్రష్టత తప్పదని మా యభిప్రాయము. మీ తండ్రి నాకు ఆప్తుడని యెరుగుదువు. నామాట విను' మనెను.

నేను 'మీరు మా యయ్య కాప్తులు, నాకు బూజ్యులు నని యెఱుగుదును కాని నా సీమప్రయాణము తీర నిశ్చయమైన పిమ్మట నిపుడేమి చేయగలను ? మా తండ్రికి స్నేహితుడు, ఉపదేష్టయునగు బ్రాహ్మణ పండితుడు ఈ పనిలో దోషములేదని చెప్పెను. మా యమ్మయు, నన్నయు గూడ నా కనుజ్ఞ యిచ్చిరంటిని.

'నీ కొలమువారి యాజ్ఞను ధిక్కరింతు వన్నమాట ?'

'నే నింతకంటె ఏమి చెప్పగలను. కొలమువారి కిందు జోక్యము తగదనుకొందును.'

సేటు కీ మాటలపై గోపమువచ్చెను. నన్ను నాలుగు తిట్టెను. నేను మిన్నక కూరుచుంటిని. అంతట సేటు 'ఈ కుఱ్ఱవానికి నేటి నుండి కులమున నెలి. ఈతని సాగనంపువారికి, ఆదుకొనువారికి తలకు రూపాయి పావులా దండుగ విధించుచుంటి' నని ఆంక్ష పెట్టెను.

ఈ యాంక్షకు నేను జలింపలేదు. సేటువద్ద సెలవుగైకొంటిని. మరి మా యన్న దీని కేమనునోయని కించపడితిని గాని ఆయనయు నా భాగ్యవశమున సుస్థిరుడై, 'సేటు ఆంక్షల కేమిలెమ్ము. నీవు వెళ్ళుట కనుజ్ఞనిచ్చుచున్నా' నని నాకు ధైర్యము చెప్పుచు లేఖ పంపెను.

శ్రీ త్ర్యంబకరాయ మజుందారు అనెడి జునఘడ్ వకీలు గనిలో నాకును ఓడలో చోటు ముందుగ నేమాటాడి నా స్నేహితులు కుదిర్చిరి. నన్ను గనుపెట్టియుండు డని ఆయనకు న న్నొప్పగించిరి. ఆయన లోకజ్ఞుడు, వయఃపరిపాకము ననుభవము గలవాడు. లోక మన నేమోయెరుగని పదునెన్మిదేండ్ల కుఱ్ఱవాడను నేను. శ్రీ ముజుందారు కుఱ్ఱవానికోసము బెంగవలదని నా స్నేహితులకు జెప్పెను.

సెప్టెంబరు నాలుగవదినమున ఎట్టకేలకు బొంబాయినుండి పయనమై పోయితిని.

వ్యాసరచనకు

సీమప్రయాణమునకు ముందు గాంధిజీ పడిన యిగచాట్లను వర్ణింపుము.

# 9

## ఓ డ లో

నాకు ఆంగ్లమున ప్రసంగ మలవాటు లేదు. మేమున్న రెండవ అంతస్థునందు శ్రీ ముజుందారు తప్ప నందరు ఆంగ్లేయులే. వారు నన్ను బలుకరింపగా నాకు తిన్నగా నర్థమయ్యెడిది కాదు. వారికి బదులు పలుకుటెట్లు? ప్రతి వాక్యము మనసులో కూడబలికికొనక నోరు విప్పుట కుదురదాయెను. కత్తులతో, ముల్లుగరిటెలతో తినుట యలవాటు లేక, చేసిన పదార్థములలో మాంసము కలియని వేవో తెలియక, అడుగుటకు ధైర్యము చాలక అగచాట్లుగా నుండెడిది. కావున పంక్తిలో మేజాపై నెన్నడుతినక, నాగదిలోనే కూరుచుండి, వెంట దెచ్చుకొనిన పండ్లతో, మిఠాయిలతో కాలము గడపుచుంటిని. శ్రీ ముజుందారు కిట్టి బాధ లేదుగాన అయన అందరితో కలసిమెలసి పోయి, ఓడ పైతట్టున దిరుగుచుండ నేను పవలెల్ల నా గదిలోనే ఒంటరినై యుండి. జనము పలుచగానున్న సమయముచూచి తట్టుపై కేగుచుంటిని. శ్రీ ముజుందారు నన్ను అందరితో కలసి మెలసి మాటలాడుచుండు మని హెచ్చరించెను. లాయర్లకు వాచాలత లేకున్న సాగదనిచెప్పి, తన ప్లీడరీ యనుభవము వేకరువు పెట్టు వాడు. అవసరమైనపుడెల్ల కొంకక ఆంగ్లమున బ్రసంగింపుమనియు, అన్యభాషగావున తప్పులు దొరలుట తప్పదనియు నుపదేశించెను. ఏమిచెప్పినను నా బిడియము నన్ను వదలదాయెను.

ప్రయాణికులలో నొక ఆంగ్లేయుడు, నాకంటె వయస్సున బెద్దవాడు కలిపిగోలుతనమున నన్ను బలుకరించి 'నీ వెచటికి కేగు చుంటివి, మీ రెవరు, ఏమి తినుచుంటివి, నీకింతటి బిడియమెందులకు?'

అని ప్రసంగములోనికి దింపి, 'మాతో కలిసి భుజింతువుగాని రమ్ము' అని పిలిచెను. 'నేను మాంసము తినను' అను నా పట్టుదలకు నవ్వెను. ఎట్లాంటిక్ సముద్రము చేరిన పిమ్మట నొకనాడు స్నేహపూర్వకముగా నిట్లు చెప్పెను: 'ఇందనుక ఎట్లో జరిగిపోయినదిగాని బిస్కే అఖాతము చేరినపై నీ పంతము సాగదు. ఇంగ్లండు చేరినపై నిక చెప్పెడి దేమి, ఆ చలిలో మాంసము దినకున్నచో బ్రదుకుటే దుర్ఘటము.'

నేను 'మాంసము మానియు నచట బ్రదుకవచ్చునని వింటినే' యంటిని. ఆతడు 'అవి కల్లమాటలు. నా యెరుకలో అచట నట్లు బ్రదుకు వారెవ్వరును లేరు. మరియొకటి చూడుము. నేను మద్యము త్రాగుచున్నను నిన్ను త్రాగుమంటినా? మాంసము మాట వేరు. అది మానినచో బ్రదుక లేవు' అనెను.

'నా హితము గోరి చెప్పుచున్న మీ మేలు మరవ లేను. నేను మాంసము ముట్టనని మా యమ్మకడ ప్రమాణము చేసితిని. కావున దాని జోలికేగను. మాంసము దినకుండ ఇచట బ్రదుకుట పొసగనిచో దిరిగి మా దేశమునకే పోదును' అంటిని.

బిస్కే అఖాతము ప్రవేశించిన పిమ్మట గూడ మద్య మాంసములతో నాకు అక్కర కలుగలేదు. మేము సౌదాంప్టను చేరినది శనివారమున నని జ్ఞాపకము. ప్రయాణము పొడవునను నేను నల్లని యుడుపులే ధరించితిని. ఓడ దిగినపుడు తెల్లని దుస్తులు తాల్చినచో దగియుండునని యెంచి, నా స్నేహితులు కుట్టించి యిచ్చిన తెల్లని ఉన్ని దుస్తులతో ఓడనుండి బయల్వెడలితిని. అది సెప్టెంబరు నెల

యగుటచే నేనుతప్ప మరి యెవరు నట్టి యుడుపులు ధరింపకుండుట గనుకొంటిని. ప్రయాణీకు లందరును తమతమ సామానులు గ్రిండ్లే కంపెనీ వశమున విడిచి చనుచుండుట యరసి నేనును నా పెట్టెలు బేజులు తాళపు చెవులతోగూడ ఆ కంపెనీ కప్పగించి వెడలిపోతిని. లండనులో విక్టోరియాహోటలు అనుకూలముగా నుండునని ఓడలో కొందరు చెప్పగా విని నేనును శ్రీ ముజుందారును అచట బస చేసితిమి. ఇతరు లెవ్వరును ధరింపని ఆ తెల్లని దిరీసు (Dress) వలన నాలో నాకే సిగ్గు తల ముక్కలగుచుండెను. గ్రిండ్లే కప్పగించిన మా సామానులు మరునా డాదివారము గాన, సోమవారమువరకు రావని హోటలులో దెలియవచ్చెను. ఇక నా దురవస్థ ఏమని చెప్పను!

సౌదాంప్టనునుండియే డాక్టరు మెహాతాకు నేను తంతివార్త నంపితినిగాన నాటిరేయి ఎనిమిదిగంటలవేళ కాయన వచ్చి నన్ను సాదరముగ బల్కరించెను. తెల్లని నాదుసున్ని వేషము గాంచి నవ్వుకొనెను. ఆయనతో మాటలాడుచు అలవోకగా ఆయన టోపీని చేతిలోనికి దీసికొంటిని. దాని నునుపునకు అబ్బురపడుచు చేతితో దానిపై ఎగదువ్వినంతట అందలి రోమరాజి నాలుదప్పి వాటము చెడెను. డాక్టరు మెహాతా మొగము చిట్లించుచు నావంక గనుగొని ఆపనినుండి నన్ను వారించెను. కాని జరుగవలసిన పొరపాటేమో జరిగిపోయినది. ఇకముందట్టి ఎడ్డెపనులు చేయకుండ నాకది మూదలింపైనది 'ఒరుల వస్తువుల నెన్నడు ముట్టకుము. కొత్తవారిని, మన దేశమునందువలె, ప్రశ్న లడుగకుము. బిగ్గరగా మాటలాడకుము ఇచటివారిని మన దేశములోవలె 'అయ్యగారూ!'

అని సంబోధింపకము. ఇచట భృత్యులుమాత్రమే యజమానుల నట్లు పిలుతురు.' ఇత్యాదిగా డాక్టరు మెహతా నా కిచటి సదా చారముల నుపదేశించెను. ఈ హోటెలు నివాసము అధికవ్యయ కారణముగాన ఎచటనైన గృహస్థులయింట నుండుట మంచిదియని కూడ ఆయన హితము చెప్పెను.

శ్రీ ముజుందారుకు, నాకుగూడ హోటలు నివాసము కష్టము గను, దండుగమారిగను తోచినది. మాల్టానుండీ మాతోగలిసి ప్రయాణముచేసిన సింధుదేశవాసితో శ్రీ ముజుందారునకు స్నేహ మేర్పడెను. ఆయన లండనులో ప్రాతకాపగుటచే మాకు వేరుగా బస ఏర్పాటుచేయుదు ననెను. మేము వల్లెయంటిమి. సోమవార మున మా సామానులు వచ్చి చేరినంతనే హోటలుముడుపు చెల్లించి క్రొత్తగదుల కేగితిమి. హోటలుకు నేను మూడు పౌనుల ముడుపు చెల్లించితినని గురుతు. అంతటి సొమ్ము ఇచ్చునపుడు నాకు గుండె లావటించిపోయెను. నిజమునకు నాకచట నేమియు రుచింపమిచే, నే నా రెణ్ణాళ్లు ఉపవాసమే చేసితిని. నా కొక పదార్థము రుచింపక, మరియొకటి అడిగినంతట ఆ రెంటికి నాపేర బద్దువ్రాసిరి. బొంబాయి నుండి తెచ్చుకొనిన తినుబండములతోనే నేనచట పొట్టనింపుకొను టాయెను.

క్రొత్త గదులలో నివాసముగూడ నాకు సుఖముగా లేదు. మా యింటిపై, మా యమ్మపై నాకు బెంగ కలుగజొచ్చెను. రాత్రులు స్వగృహము తలపునకురాగా కన్నీరు గార్చికొనుచు నిద్దురకు మొగమువాచిపోవుచుంటిని. నాయీబాధ ఒరులతో జెప్పి కొనుటెట్లు? చెప్పికొన్నను నాకీబాధ ఆర్చుటకు, దీర్చుటకు నచట

నెవరున్నారు? అచటి ప్రజలు, వారి యిండ్లు, నడవడి—అన్నియు నాకు క్రొత్తగా నుండెను. ఆంగ్లేయుల ఆచారకాండ నాకు సరిక్రొత్త యగుటచే నెపు డేమి పొరపాటు వచ్చునో యని గుండెలు బిదుకు బిదుకు మనుచునే యుండెను. దీనికితోడు నా శాకాహార శపథ మొకటి. నేను తినదగిన పదార్థములుగూడ నాలుకకు రుచింపమిచే నాపని నూయియు గోయియు నన్నటు లుండెను. సీమలో నివాసమా, నాకు పడదయ్యెను; ఇంటికి మరలిపోవుటయా, కానిపనియయ్యెను. 'తీర వచ్చితివి కావున ఈ మూడేండ్లు కనులుమూసికొని గడుపు' మని అంతరాత్మ ప్రబోధించెను.

# ద్వితీయ భాగము : సీమలో విద్యాభ్యాసము

## 10

## లండనులో

సోమవారమునాడు డాక్టరు మెహతా నాకొరకు విక్టోరియా హోటలు కేగెను. మేమటనుండి బస మార్చితిమని తెలిసికొని, మా క్రొత్తవసతి కేతెంచెను. నా గదని, అందలి పనికరములను పరిశీలించి పెదవి విరిచెను. 'నీ కీ బస బాగుండలేదు. మనము సీమకు వచ్చినది—విద్యాభ్యాసముమాట యెటులున్నను—ముఖ్యముగ నిచటి ఆచారవ్యవహారముల నలవరచుకొనుటకు. అందులకు, ఎవరేని సంసారుల యింట నీవుండవలయును. అట్టి యేర్పాటు కుదురులోపల నిన్నొకచోట నుంచెదను; నాతో రమ్ము' అనెను.

నేను 'మీదయ' యనుచు నందుల కంగీకరించి, పా ఆయన మిత్రుని గదులలోనికి బసను మార్చితిని. ఆ మిత్రుడు నన్ను మిగుల నాదరించి తన తమ్మునివలె చూచుకొనసాగెను. ఆంగ్లేయుల ఆచారవ్యవహారములను నాకు మప్పుచు, ఆంగ్లమున సంభాషించుట అలవాటుచేసెను. నాకు భోజనముతోడనే పెద్దచిక్కు వచ్చిపడెను. తాలింపు వేయక, ఊరక ఉడికించిన కూరలు నాకు రుచింపవయ్యెను. ఏమిచేసిన నాకు హితమగునో ఆ యింటియామెకు తోచకపోయెను.

ఉదయమున ఓట్లపిండితో జావ వండి పెట్టెడిది. దానితో కడుపు బాగుగా నిండుచుండెనుగాని మధ్యాహ్నము. రాత్రియు ఉపవాస ప్రాయ మగుచుండెను. మాంసము దినుమని ఆ మిత్రము నాకు బదేపదే నచ్చజెప్పజూచెనుగాని నేను నా ప్రతినమాట చెప్పి మిన్న కుండెడివాడను. మధ్యాహ్నము, రాత్రియు నాకు కూరలు, రొట్టెతో మురబ్బాయు వడ్డించుచుండిరి. నేను మంచి భోజనపుష్టి గలవాడనుగాన వానితో కడుపు నిండెడిది కాదు. మారు వడ్డించు మనుట మరియాదకు లోపమనిపించెను. దానికి దోడుగా బవలు రేయియు పాలు కరవయ్యెను. నామిత్రు డిదియంతయు జూచి పట్టజాలక ఒకనా డిట్లనియెను. 'నీవు నా సోదరుడవైనచో ఈపాటికి ఇంటికి పంపియుందును. ఇచటి స్థితిగతులు ఎరుగకముందు, చదువు సంధ్యలులేని నీ తల్లితో చేసిన శపథమును పట్టుకొని కూరుచుండ నేల? అది శపథమే కాదు. ధర్మశాస్త్ర మట్టిశపథమును పాటింపదు. అట్టి ప్రతినకై ఇట్టి పట్టుపట్టుట అజ్ఞానము. నామాట వినుము, ఈ పట్టు విడువవేని నీ విచట నేమియు సాధింపజాలవు. అదియునుగాక నీవింతకుమున్ను మాంసము తింటివి. నీ కది రుచించెనంటివి. అక్కర లేనిసమయమున నేమో మాంస మారగించితివి, తినక తీరని తరివచ్చి నపుడేమో తిననను చుంటివి. నీ యభాగ్యము నేమందును.'

ఎంత చెప్పినను నేను మాత్రము లొంగలేదు.

అహరహము నాతో నాతడిట్లు ఎంతగా వాదించినను నేను 'ననేమిరా'యనుచుంటిని. ఆతడు చెప్పుచున్నకొలది నేను బిఱ్ఱబిగియ జొచ్చితిని. దినదినము నీశ్వరుని వేడికొనుచు తదనుగ్రహపాత్రుడ నగుచుంటిని. 'నేనట్లు ప్రార్థించుట ఈశ్వరజ్ఞానముచే గాదు;

ఏదియో భక్తి నాలో మొదల జొచ్చెను. చిననాడు నాదాది గ్రంథ నాలో నాటిన బీజమే ఆ భక్తి.

నే నింకను తిన్నగా చదువు ధోరణిలో బడలేదు. స్వదేశ మున నే నెన్నడు వార్తాపత్రిక చదివినవాడను గాకున్నను ఇచట క్రమముగా దాని నలవాటు చేసికొంటిని. పత్రికాపఠన మొక గంట లోపలనే ముగిసెడిది. పిమ్మట నగరమున దిరుగుచు శాకాహార శాల కొరకు వెదుకుచుండగా ఫారింగ్టను వీథిలో నది యగుపడెను. కోరిన వస్తువు చేతికబ్బిన పసివానివలె నేను దానిని జూడగనే కొండ నెక్కితిని. లోని కేగుచుండ ద్వారముచెంత నద్దముల యరలో నున్న పుస్తకములు నా కంటబడెను. వానిలో సాల్టు అను నతడు శాకాహారమునుగూర్చి వ్రాసిన గ్రంథముం గాంచి ఒక షిల్లింగిచ్చి దానిం గొని భోజనశాలలోని కేగితిని. సీమలో నడుగుపెట్టిన పిమ్మట నేను కడుపార భుజించిన దానాడే. పరమేశ్వరుడు నన్నను గ్రహించెను.

సాల్టు రచించిన గ్రంథ మామూలాగ్రముగా జదివితిని. నా కది ఎంతయేని నచ్చెను. చేసిన బాసకొరకు మిన్నాళ్లు దినుచున్న శాకాహారమును ఆ గ్రంథము చదివిననాటినుండి మనసా వరించి కైకొన జొచ్చితిని. మా యమ్మకు నేను మాట యిచ్చిన శుభ దినము నా చల్లనివేళ స్మరించుకొంటిని. శాకాహార వరణమేమో జరిగినది కాన తత్ప్రచారమునకు నాటినుండి నడుము గట్టితిని.

# 11

## ఆంగ్ల సభ్యతానుకరణం

నా మిత్రము నన్ను గూర్చి అలజడి చెందుచునే యుండెను. ఒకనాడు నాటకమును దిలకింతము రమ్మని నన్ను బిలిచెను. ప్రదర్శనము ప్రారంభ మగులోపల హాల్బరన్ హోటలులో భోజనమున కేగితిమి. అచట నేను ఏడియముకోలద పదార్థములను గూర్చి ప్రశ్నలడుగకుండ భుజింతునని ఆత డనుకొని ఈ పన్నాగము పన్నెను. అచట చాలమంది భుజించుచుండిరి. మేము ముదుపురము నొక బల్లకడ గూరుచుంటిమి. ముందుగా 'సూపు' (పులుసు) వడ్డింపగా, నది దేనితో చేసిరో తెలియక, నా మిత్రుని ప్రశ్నించుటకు ధైర్యము చాలక, వడ్డించువానిని బిలిచితిని. నా స్నేహితు డది కనుపెట్టి, కోరకోరలాడుచు 'ఎందుకు వానిని బిలిచెద' వనెను. నేను సంకోచించుచు 'ఈ సూపు శాకములతో జేసిరో, లేదో కనుగొనుటకు' అంటిని. ఆతడు 'నీవంటి ఎడ్డెమానిసి సభ్య సమాజములో నుండదగడు. ఇచట మరి సూదమై మెలగ నేరనిచో మరియొక హోటలులో భుజించి నా కొరకు వెలుపల వేచియుండు' మని కసరకొట్టెను. బ్రదుకు జీవుడా యనుచు నటనుండి వెడలి యేగితిని. ఆ ప్రాంతమున నున్న శాకాహార శాల మూసియుంటచే నాటిరేయి నా కుపవాసమే యయ్యెను. పిమ్మట స్నేహితుడు నేనును నాటకమున కేగితిమి. ఆతడు నా వెకలితనమును గూర్చిన ప్రసక్తి మరి తేసుకొనిరాలేదు. నాకు మాత్ర మేమిపనియని నేనును మిన్నకుంటిని.

మిత్రులమగు మా మధ్య నదియే తుదికలహము. దీనిచే మా మైత్రి కెట్టి పొరపొచ్చెమును కలుగలేదు. నాయెడ ప్రీతి

కతమున నే కదా ఆతడు నాకొఱకింత ప్రయాస పడెనని గ్రహింపని వాడను గాను. నా తలపులలో, చేతలలో నున్న ఈ భేదము చే నా కాతనియెడ గౌరవ మతిశయించెను.

నేను శాకాహారినయ్యు, ఎడ్డెతనము నుజ్జగించి, సభ్యతా లక్షణముల నలవరచికొని నాచెలికానికి సంతోషముగూర్ప నెంచితిని. సభ్యజనమున పద్దు గైకొనుటయను అశక్యకార్యమును సాధింప బూనుకొంటిని.

బొంబాయిలో కుట్టించుకొన్న నా దుస్తులు ఆంగ్లసమాజమున కనర్హములని యెంచి 'ఆర్మీ అండు నేవీ స్టోర్సు'లో క్రొత్తయుడుపులు గొంటిని. ఆ దినములలో విపరీతమగు వెలయిచ్చి 19 షిల్లింగుల కొక 'చిమ్నీపాట్' టోపీ నిలిచితిని. అంతటితో తృప్తిచెందక లండనులో నాగరజనావాసమగు బాండువీధిలో తయారుచేసిన సంజ యుడుపులకై పదిపౌనులు పాడుచేసితిని. దాక్షిణ్యశాలియు, సుజనుడు నగు నా యన్నకడ నుండి రెండుపేటల పైడిగొలుసును గడియారముకోసమై తెప్పించితిని. తయారుచేసిన కంఠబంధము (Neck-tie) ధరించుట మర్యాదాలోపముగావున దానిని స్వయముగా ముడివైచుకొను విద్య నభ్యసించితిని. స్వదేశమున మా యింటి మంగలి క్షురకర్మ చేయునపుడు మాత్రమే నాకు దర్పణ భోగము లభించెడిది. ఇచట ప్రతిదినము నిలువుటద్దము ముందు నిలిచి కంఠబంధము సర్దుకొనుటకు, పాపట చక్కదిద్దుకొనుటకు పది నిముసములసేపు పడట గలియుచుండెను. నా వి గరకు వెంట్రుక లగుటచే నవి చెప్పినట్లు వినవు. వానిని బుర్సుతో (Brush) నణగదువ్వుట కేనాటి కానాడు సదమద మగుచుంటిని. టోపీ తీసినపుడు, ధరించినపు

డెల్ల చేయి తనంతటదా జుట్టును సర్దుకొనసాగెను. సభ్యజన మధ్యమున నున్నపుడెల్ల మాటిమాటికి చేతికాపని తగులుచుండు సదాచారమును గూర్చి మరి చెప్పెడి దేమి!

నాగరక ముద్ర తాల్చుట కివి యన్నియు జాలవో యన్నట్లు ఆంగ్ల శిష్ట పంక్తికి నన్నర్హుని జేయుటకు వలయు నితరలక్షణములపై దృష్టి సారించితిని. నాట్యమును, పరాసు భాషను, వక్తృత్వమును నేర్చుట తప్పదని కొందరనిరి. పొరుగున నున్న పరాసుదేశము నందే కాక పరాసుభాష యూరపుఖండ మందంతట వాడుకలో నున్నది. యూరపు నందంతట సంచరించు నభిలాష నాకుండెను. నాట్యము నేర్పు బడిలో చేరి మొదటి వాయిదా 3 పౌనులు చెల్లించితిని. మూడు వారములలో నారు పాఠములు గాబోలు నేర్చి కొంటిని. కాని, తాళము తప్పకుండ నడుగులువేయుట నా తలకు మించిన పనియని తేలిపోయెను. పియానో ననుసరింప లేక పోవుటచే తాళగతి నా కసాధ్యమాయెను. ఇక నాకేమి గతి? వెనుక నొక యోగి గోచిపాత నెలుకలు తినకుండ పిల్లిని పెంచెనట. పిల్లి పాలకై ఆవును పెంచెనట. 'కౌపీన సంరక్షణార్థమయం పటాటోప' అని ఆ యోగి కిట్లు సంసారము పెరిగిపోయెనట. నాకును ఆ చందమే వచ్చెను. పాశ్చాత్య సంగీత రసజ్ఞతకై ఫిడేలు వాద్యము నభ్యసింపవలెనని నాకు దోచెను. అంతటా మూడు పౌనుల కొక ఫిడేలు కొంటిని. తదభ్యాసమునకై ఇంచుమించు మరియంత సొమ్ము వ్యయ మొనర్చితిని. వక్తృత్వ మభ్యసించుటకై మూడవ గురువు నాశ్రయించి అవసర దక్షిణగా ఆయన కొక గినీ అర్పించితిని. 'బెల్' రచించిన 'స్టాండర్డు ఎలొక్యూషనిస్టు' అను గ్రంథము చదువుమని

ఆయన చెప్పగా దానిని కొంటిని. ఆ గ్రంథమున 'పిట్టు' ఉపన్యాసము వల్లింపసాగితిని.

అంతట నాకీ శ్రమయంతయు దేనికి అను ఆలోచనపొడమెను.

నా బ్రతుకంతయు ఈ సీమలోనే తెల్లవారదుకదా. అట్టిచో ఆంగ్లభాషా వాచాలతతో నా కేమిపని? నాట్యము నన్ను సభ్యజనుని చేయునా? ఫిడేలు స్వదేశముననే నేర్వవచ్చునే! నేను విద్యార్జనకుగదా ఇచటికి వచ్చినది? ముందు బారిష్టరునగుట నాకు గర్తవ్యము. సచ్ఛీలము నన్ను శిష్టుని జేయగలదేని అది లెస్స. కాని నాడు నేనా యాస వదలుటే మేలుఅనుకొంటిని.

ఇట్టి యాలోచనాపరంపరకు వశుడనై, వక్తృత్వోపాధ్యాయునకు నా తలపు దెలుపుచు నొక లేఖ వ్రాసి 'నా కింక ఆ పాఠములు వలదు; నన్ను క్షమింపు' డంటిని. ఆయనకడ నేను రెండో మూడో పాఠములు మాత్రమే నేర్చితిని. నాట్యాచార్యునకు గూడ నట్లే లేఖ యంపితిని. ఫిడేలు గురువుచెంతకు నేనే వెళ్ళి నా ఫిడేలును వచ్చినంతకు అమ్మిపెట్టుడని చెప్పితిని. ఆమెకడ చనవుండుటచే నేను ఎండమావుల వెంటాడుచుంటినని తెలిసివచ్చె నంటిని. క్రొత్తదారి త్రొక్కవలయునను నా నిశ్చయము నామెయు బ్రోత్సహించెను.

ఆ వెఱ్ఱిలో మూడునెలలు కాబోలు పడియుంటిని. వేషమును గూర్చిన పట్టింపు కొన్నియేండ్లకుగాని వదలలేదు. అది మొదలు నేను విద్యార్థినైతిని.

# 12

## మార్పులు

నేను నాట్యాదికము నభ్యసించునపుడు భోగ పరాయణుడనై యుంటి ననుకొందురేమో! లేదు. అపుడుగూడ నేను చేయుచుండిన వ్యయమును లెక్కచూచుకొనుచు మెలకువగనే చరించితినని పఠితలు గ్రహింపకపోరు.

జాగరూకతమై చరించుచుంటిని గనుకనే వ్యయకర్తనము తప్పదని తెలిసికొంటిని. వెంటనే సంసారుల యింట నుండుట మాని వేరుగా గదులు తీసికొన నిశ్చయించితిని. నా పనినిబట్టి వేర్వేరు చోటులకు బస మార్చుచున్నచో వ్యయము తగ్గి, లోకానుభవ మధికమగునని యెంచితిని. నాకు బసియున్న చోటికి బస దగ్గరగా నున్నచో బండ్లబాడుగ యుండదు. ఒక్క అరగంటలో నేను తేలికగా నడచిపోవచ్చును. ఆవర కెచటికేగినను బాడుగబండి మీదనే కావున కొంత దూరము నడచు నలవాటునకై వేరుగా తీరిక చూచుకొనుచుంటిని. ఇక నట్లుగాదు. వ్యయకర్తనమును, దినమున కేడెనిమిది మైళ్ళు నడచు వ్యాయామమును కలసివచ్చెను. చాల దూరమిట్లు నడచు నలవాటే సీమలోనున్న కాలమున నా యారోగ్యము గాపాడి, నన్ను దృఢగాత్రు నొనర్చెను.

పడుకకు, బనిపాటులకు సరిపడ రెండు గదులద్దెకు దీసికొంటిని. ఇది యచటి రెండవదశ. మూడవ దశ ఇంకను ముందున్నది.

ఈ మార్పులచే ధనవ్యయము సగము తగ్గెను. ఇక కాలమును కూడ దీసికొనవలెను. బారిష్టరు పరీక్షకు జదువు శ్రమ

మంతగా నుండదని యెరుగుదును గాన దానికై కాలము పొదుపు జేసికొన బనిలేదు. ఆంగ్ల భాషలో నాకు ప్రవేశము తక్కువ. నా కది యెడతెగని బాధయైపోయెను. కావున లాయరు పరీక్షతోపాటు భాషాపండిత పట్టము గూడ సంపాదించుట మేలని యెంచితిని. ఆక్స్ ఫర్డు కేంబ్రిడ్జి పరీక్షలను గూర్చి ఆలోచించితిని. స్నేహితులతో సంప్రదింపగా — ఆ రెంటిలో నెచటికేగినను ధనవ్యయ మధికమగుటే కాక సీమలో నే ననుకొన్న దానికంటె ఎక్కువ కాలము ఉండవలసి వచ్చునని తేలెను. 'నీ వేదేని గట్టి భాషా పరీక్ష ఈయనెంచినచో లండను మెట్రిక్యులేషన్ పరీక్ష యిచ్చుట యుక్త' మని ఒక స్నేహితుడు తెలిపెను. శ్రమ మధికమైనను వేరుగా ధనము వెచ్చింపకయే జ్ఞాన సముపార్జనము లభించునుగాన ఇది బాగుగనే యున్నదనుకొని, పాఠ్యగ్రంథ పట్టిక చూతునుగదా, భీతి జనించెను. లాటిను భాషయు నొక నవీన భాషయు నేర్చుట తప్ప డాపరీక్షకు. నేను లాటిను నెట్లు సాధింతును? ఒక మిత్రము 'లాటిను నేర్చుట లాయర్లకు ప్రయోజనకారి. ఆ భాష వచ్చినచో లా గ్రంథములు సులభముగా నన్వయించును. రోమన్ లా పరీక్షాపత్రమంతయు లాటిన్ మయమే. లాటిన్ నేర్చినవారికి ఆంగ్లభాష యనిన నల్లేరుపై బండిగా నుండును' అని బోధించెను. నాకామాటలు నచ్చెను. ఎంతటి కష్టమైన నోర్చి లాటినుభాష సాధింప నిశ్చయించితిని. నే నెట్టును 'పరాసు భాష నేర్చుచుంటినిగాన నది నవీన భాషగా నుపయోగపడును. మెట్రిక్యులేషన్ విద్యను నేర్పు ఒక బడిలో చేరితిని. ఆరు నెలల కొకతూరి జరగెడి ఆ పరీక్షలకిక నైదు నెలలే వ్యవధియుండెను. ఆ పని నా కసాధ్యముగా గనుపట్టెను. నేను వెంటనే విద్యాభ్యాసన దీక్షబూని

నిముషము గూడ వ్యర్థము గాకుండ కాలమును చదువునకై వినియోగించుకొంటిని. కాని, ఒకవంక లాటిను ఫ్రెంచి భాష నభ్యసించుచు, తక్కిన పాఠ్యవిషయములను సాధించుటకు నా బుద్ధిబలమును, ధారణాశక్తియు చాలవని తోచెను. తుదకు లాటిను పరీక్షలో భంగపడితిని. దానిచే కొంత దుఃఖము గల్గినను ధైర్యమును గోలుపోలేను. లాటిను భాషపై అభిరుచి అలవడెను. పరాసుభాషను గూడ మరొకతూరి చదువుట మంచిదేయనుకొంటిని. సైన్సు గణములో రసాయనశాస్త్రము సంతతము నభ్యసించితినిగాని అందు ప్రయోగభాగము లేనందుచే నాకది రుచింపదాయెను. వస్తుతః ఆ శాస్త్రాభ్యాసము ప్రీతిజనకము కాదగినదే. స్వదేశమున తప్పనిసరియై చదివితినిగాన ఈ మెట్రిక్యులేషన్ పాఠ్యములలో దానిని వరించుటయ్యెను. రెండవతూరి పరీక్షకు దానిని విడచి కాంతిని, ఉష్ణమును పాఠ్యముగా వరించితిని. ఇవి తేలికగా నేర్వవచ్చునని యెంచితిని. ఆమాట నిక్కమేయని తెలిసికొంటిని.

ఈ నూతన యత్నమునకై ఇంకను పొదుపుచేయసాగితిని. ఇచట నా ధనవ్యయము మా సంసారపు పెత్తనకింకను మించియున్నట్లే కనుపించెను. నే నడిగినపుడెల్ల దాక్షిణ్యముతో సొమ్ము నంపుచున్న మా యన్న అచట నెన్నియగచాట్ల కగ్గమగుచుండెనో యని బాధపడితిని. ఇచట కొందరు నెలకు 8 మొదలు 15 పౌనులు దాక వెచ్చపెట్టువా రుండిరన్నచో వారికెల్ల విద్యార్థి భృతులేర్పడియున్నవి. పొదుపుగా బ్రదుకుచున్నవా రిచట నెందరో యున్నారు. నాకంటెగూడ హీనముగా గడపికొను బీదవిద్యార్థు లెందరినో చూచితిని. పెదలుండు గూడెములో వారమునకు రెండు షిల్లింగుల

బాడుగ కొక గదిలో నివసించుచున్నా డొక విద్యార్థి. 'లాక్ హారు' చవుక యంగడిలో రెండుపెన్నీలకింత రొట్టెదిని. ఇంత కోకో త్రాగి పూటకు కాల మీడుచుండెను. అతనివలె నుండవలెనని కాదుగాని రెండు గదుల బదులొక గదితోనే సరిపెట్టుకొని, కొంత సొంతవంట చేసికొనుట మంచిదని తోచెను. అట్లు చేసినచో నెలకు నాలుగైదు పౌనులు కలసివచ్చును. పొదుపరి బ్రదుకును గూర్చిన గ్రంథములను నేను చదువుటయు దటస్థించెను. అంతట నొక్కగదియే అద్దెకు తీసుకొని, కుంపటి నొకటి కొని, ప్రాతర్భోజనమును వండికొన సాగితిని. ఓట్లపిండి జావయు, కోకోకు నీటిని కాచుకొనుట కిరువది నిముసముల కంటె ఎక్కువ వేళ పట్టదు. మధ్యాహ్న భోజన మెచట నేని చేయుచు, రాత్రులందింటనే రొట్టె దిని కోకో త్రావుచుంటిని. ఈ విధముగా దినబత్తెమునకు 15 పెన్నీలు సరిపోవుచుండెను. ఆనాళ్ళలోనే శ్రమపడి చదువవలసి యుండెను; గాన నాకు కాల మధికముగా కలసివచ్చుటచే పరీక్షలో విజయమందితిని.

ఈ పొదుపరి జీవనముచే నేను గారియపాలైతినని యెంచకుడు. ఈ మార్పులు నాకు హితమగుటే కాక మా సంసారపు టెత్తునకు గూడ తగియుండెను. తొల్లిటికంటె నా బ్రదుకు సత్యపూరితమై, ఆనందమున నోలలార్చెను.

ఈ పొదుపరితనమును,• జీవన పద్ధతిలో మార్పును అవలంబించినపుడో, అంత కొక్కింత పూర్వముననో నా భోజనమున మార్పులుచేయ నారంభించితిని. ఇంటికడనుండి వచ్చు మిఠాయిని, తాలింపు దినుసులను వదలితిని. అంతకుమున్ను 'రిచ్మండు' లో నూరక యుడుకబెట్టిన ఆకు కూరలు సైపని నాకిపుడు మనసు మారు

బచే తాలింపులపై నాస్థ పీడిపోయెను. ఇట్లు బహువార పరిశోధ
నము చేసినమీదట రుచి మనస్సులో నున్నదిగాని నాలుకలోలేదని
తెలిసిపోయెను.

పొమ్ము పొదుపుచేయుటను గూర్చికూడ నే నాలోచించుచునే
యుంటిని. కాఫీ టీ పానము చెరుపు చేయుననియు. కోకో మంచి
దనియు నాకాలమున గొందరు చెప్పవొడగిరి. దేహమునకు పుష్టి
నిచ్చు పదార్థమే తినవలయునను నిశ్చయము నాకేర్పడుటచే కాఫీ
టీ లను నియమముమై వర్జించి కోకో త్రాగుచుంటిని.

భోజన విషయమున మరికొన్ని చిల్లర ప్రయోగములనుగూడ
సాగించి ఒకపుడు పిండిదినుసులు మానుచుంటిని. మరొకపుడురొట్టితో
పాలతో నుంటిని. ఇంకొకపుడు పాలతో, మీగడతో, గ్రుడ్లతో
కాలక్షేపముచేసి చూచితిని. ఈ తుదిప్రయోగము పక్షము దిన
ములకంటె నధికముగా నడవలేదనుట గమనింప దగినది. పిండి
దినుసులు మానదగునని చెప్పిన సంస్కారులు గ్రుడ్లను మిక్కిలిగా
కొనియాడి, అవి మాంసములో చేరవని చెప్పిరి. అండభక్షణముచే
జీవహింస కలుగుట లేదని కనుపడుచుంటచే, నా ప్రతినను లక్షింపక,
గ్రుడ్లను భక్షింప జొచ్చితిని.

ఈ నా ప్రతిజ్ఞాభంగము తాత్కాలికమే. నా చేసిన శపథము
నకు క్రొత్తగా వ్యాఖ్యాన మొనర్చుట నాపని కాదు. ఈ ప్రతిన
చేయించిన మా తల్లి వ్యాఖ్యానమే నాకు ప్రమాణము. గ్రుడ్లు
గూడ మాంసమనియే ఆమె మతమని నే నెరుగుదును. నా ప్రతిన
కిదియే యర్థమగు నని తట్టినంతనే గ్రుడ్లచే జీవించు పరిశోధనమును
కట్టిపెట్టితిని.

క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెరుగడన్న చందమున నేను శాకాహార ప్రచారోత్సాహముచే మా పేటలో నొక సంఘమును స్థాపించితిని. కొంతకాల మా సంఘము చక్కగా నడచినట్లే నడచి కతిపయ మాసములలో నస్తమించెను. నానాటినానాటికి బసమార్చు నలవాటుచే నేనా పేటనుండి వెడలిపోవుటయు నొనగూడెను. స్వల్పకాలిక మగు నీ యనుభవలేశముచే నూతన సంస్థల నెలకొల్పి వానిని నడపు శిక్షణము నాకు లభించినట్లయ్యెను.

## 13

## బిడియమే నా డాలు

శాకాహారి సంఘమున నేనును కార్యనిర్వాహకుడనై సమావేశము లన్నిటికి హాజరగుచుంటినేకాని ఎన్నడు నోరువిప్పిన పాపమున బోలేదు. దక్షిణాఫ్రికాలో నన్నీ బిడియము కొంత వదలినను పూర్తిగా నన్నది యెన్నడును విడువలేదు. ముందుగా వ్రాసిపెట్టుకొనకయే ఉపన్యసించుట నా కశక్యమైపోయెను. క్రొత్తవారియెదుట పెదవి విప్పుట కెపుడును నాకు సంకోచమగుటచే ఉపన్యసింపకుండ తప్పించుకొనుచుంటిని.

నలుగురిలో నపుడపుడు నగుబాటుపాలుసేయుటతప్ప ఈ బిడియమువలన నాకు వచ్చిన నష్టమేమియు లేదు సరికదా నిజమున కది లాభదాయకమే యయ్యెను. ప్రసంగవేళ కలుగు ఈ సంకోచము తొల్లి చికాకు కలిగించినను నేడది సంతోషప్రదమైనది. భావములను నిగ్రహించుకొను అలవాటునేర్పి నాకి బిడియము మహోపకార

మొనర్చెను. మితభాషి మాటలలో భావదారిద్ర్య మెన్నడు నుండదు. ప్రతి మాటయు నాతడు తూచి వాడును. కావున బిడియమే నా పాలిటికి డాలైనది. నాకది ఆంతర పరిపాకము ఘటించి సత్య సాక్షాత్కారమునకు దారిచూపినది.

## 14

## భిన్నమత పరిచితి

సీమలో నా నివాసమునకు రెండవయేడు నిండు తరియందు నా కిరువురు దివ్యజ్ఞాన సామాజికులు పరిచితులైరి. వా రిరువురు నన్నదమ్ములు. బ్రహ్మచారులును. ఎడ్విను ఆర్నాల్డు రచించిన 'సాంగ్ సెలిస్టియల్' అను భగవద్గీతను వారు పఠించుచుండిరి. దాని మూలమును వారు నాతో చదువుమనిరి. మూలమునుగాని గుజరాతి గీతలుగాని నే నెన్నడు చదివినవాడనుగామి వా రట్లు కోరినంతట నా కెంతో సిగ్గు పొడమెను. ఉన్న నిజము వారికి వచించి, వారితో గీతలను బఠించుట నా కిష్టమే యంటిని. సంస్కృత ప్రవేశము నా కంతంత మాత్రమే యైనను, ఆంగ్ల గ్రంథము మూలముతో నెచట భేదించునో గ్రహింపగల నంటిని.

ద్వితీయాధ్యాయమున —

'ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తే షూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోపజాయతే
క్రోధాద్భవతి సమ్మోహః స్సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధి నాశోబుద్ధి నాశాత్ప్రణశ్యతి.'

అను శ్లోకములు రెండును నా మనస్సున నాటుకొని నేటికిని నా చెవులలో ప్రతిధ్వనించుచున్నవి. అమూల్యమగు నాగీతా శాస్త్రముపట్ల నానాట నాకు గౌరవము వృద్ధియై, సత్యదర్శనమున కట్టి గ్రంథము మరిలేదని నేటికి దృఢవిశ్వాస మేర్పడినది. చీకట్లు నన్నావరించిన ఘటికలందెల్ల నా గ్రంథము చేసిన మేలింతంత కాదు.

ఈ 'సాంగ్ సెలెస్టియల్' రచించిన ఎడ్విన్ ఆర్నాల్డు వ్రాసిన 'లైట్ ఆఫ్ ఏషియా' యను బుద్ధచరితమును గూడ ఆ సోదరులు నన్ను జదువుమనిరి. అంతకు మున్నా గ్రంథము నెరుగను. భగవద్గీతలపైకంటె నా కా గ్రంథముపట్ల ఎక్కువ మక్కువ జనించెను. దానిని చదువ మొదలిడి ముగింపకుండ విడువలేనైతిని. శ్రీమతి 'బ్లావట్స్కీ' రచించిన 'కీటుధియాసఫీ' అను గ్రంథమును గూడ, ఆ సోదరులు చెప్పిన మీదటనే, చదివినట్లు ఆదకు వచ్చుచున్నది. ఆ గ్రంథ పఠనముచే నాకు హిందూమత గ్రంథములు పఠించు నభిలాష జనించెను. హిందూమతము మూఢవిశ్వాసపూర్ణమని క్రిస్టియనుమత బోధకులు చేసిన బోధలెల్ల ఆ గ్రంథ పఠనముచే పటాపంచలైనవి.

మాంచెస్టరు వాసియగు నొక క్రైస్తవసుజనునితో నా కా కాలముననే శాకాహారవసతియందు పరిచితి యేర్పడెను. ఆయన క్రైస్తవ మతమును గూర్చి నాకు బోధించెను. నేనును రాజకోట యందలి నా యనుభవము నాయునకు వినిపించితిని. అది విని ఆయన చాల వ్యథచెంది, 'నేను శాకభక్షకుడను. మద్యము ముట్టను. క్రైస్తవులు చాలమంది మద్యమాంసములు సేవింతురు, నిజమేకాని అవి శాస్త్రవిహితములుగావు. బైబిలు చదివిచూడుడు' అనెను. నేను వల్లె యనినంతట ఆయన నాకొక బైబిలుప్రతి నొసగెను. నే

నది చదువ నారంభించితిని గాని 'పాత నిబంధన' (Old Testament) పూర్తిచేయుట నావలన గాలేదు.

క్రొత్తనిబంధన (New Testament) యట్లుగాక నా కాస్థాజనక మయ్యెను. అందలి 'పర్వతశిఖరోపదేశము' (Sermon on the Mount) నా హృదయము నట్టె కైవసమొనర్చికొనెను. గీతలతో దానిని పోల్చి చూచితిని. 'పాపమున కెదురొడ్డకుడు. కుడిచెంపపై గొట్టినచో నెడమ చంపను ద్రిప్పుడు. మీ కంచుకము హరించిన వానికి పంచె గూడ నిచ్చివేయుడు. ఇది నా యుపదేశము.' ఇత్యాది వాక్యములు నా కపారానందము నొడగూర్చెను. 'పుడిసెడు నీరిచ్చినవానికి కడుపెను భోజన మిడు' మన్న శ్యామలభట్టుసుభాషితము నాకు జ్ఞాపకము వచ్చెను. గీతలు, లైటాఫేషియా, సెర్మన్ ఆంది మౌంటు — ఈ మూడింటి ఉపదేశములకు నా అకృతబుద్ధి ఏక వాక్యత ఘటింప దొరకొనెను. త్యాగమే పరమధర్మమని నా హృదయమునకు వచ్చెను.

నే నొకవంక పరీక్షలో నెగ్గవలసి యున్నదిగాన మతగ్రంథములతో నాకప్పటి కింతకంటె గాఢపరిచితి కవకాశము లేకపోయెను. ఇంకను అట్టి గ్రంథములు పఠించి ముఖ్యమతము లన్నిటితో బరిచితి సంపాదించు ఆస్థమాత్రము నా కుదయించెను.

---

బైబిలులో ప్రాతనిబంధన, క్రొత్త నిబంధన యని రెండు భాగములున్నవి. మొదటిభాగమున ఏసుక్రీస్తునకు పూర్వమందలి కాలమును దెలుపు అనేక గ్రంథము లున్నవి. ఏసుక్రీస్తునకు పిమ్మటికాలపు గ్రంథములు రెండవభాగమున నున్నవి. వానిలో మొదటి నాలుగింటిని 'సువార్త' లందురు. ఏసుచరిత్రము, నుపదేశములు వానియందుండెను. 'సెర్మన్ ఆన్ ది మౌంటు' మాథ్యూసువార్తలో 5 మొదలు 7 వ అధ్యాయము లందు గలదు.

# తృతీయ భాగము : ఇండియాలో బారిష్టరుగా

## 15

## స్వ దే శా గ మ న ము

నేను పరీక్షలో నెగ్గితిని. 10–6–1891 న బారిష్టరు పట్టము పొందితిని. మరునాడు హైకోర్టులో చేరి, ఆ మరునాడు మాతృ భూమికి బయలుదేరితిని.

విద్యార్జనము చేసితినన్నమాటయేకాని నా నిస్సహాయతకు, భీతికి మేర లేదు. లాయరుపని చేయుటకు నా కర్హత లేదని తోచెను. లా గ్రంథములు చదివితినేకాని కోర్టులో వాదించుట నేర్వలేదు. ఇంతకు, హిందూదేశమందలి హిందూ లా, మహమ్మదీ లా నా చదివినవికావు. ప్లయింటు (నివేదన పత్రము) వ్రాయుటెట్లో నే నెరుగను. నాకు దారి, తెన్ను తోచలేదు. ఈ వృత్తిచే మొదలు నా పొట్ట గడచునో, లేదో యను సంశయములో బడితిని.

నా పెద్దయన్న బొంబాయి రేవులోనికి నా కెదురువచ్చెను. మా యమ్మ నెపుడు చూతునాయని నేను బెంగపెట్టుకొంటిని. నేను సీమలోనుండగనే ఆమె మరణించెను. విదేశముననుండగా నాకా దుర్వార్త వినుపింపదగదని మా యన్న నా కది తెలుపడాయెను. ఇది విని నా గుండెలు చెదరిపోయినవి. మా జననిని మృతిచే నా

కింతటి దుఃఖము కలుగలేదు. నేను పెట్టుకొన్న ఆశలన్నియు భగ్నమై పోయినవి. ఐనను నే నోడలుమరచి, వాదెరచి ఏడ్వలేదు. కనుల నీరు కనుల గ్రుక్కికొంటిని. ఎప్పటివలెనే లోకయాత్రలో బడితిని.

నా ద్వీపాంతరయాత్రచే మాకొలమున రేగిన చిచ్చు చల్లారనే లేదు. కొలమువారు రెండుగా చీలిరి. ఒకరు నన్ను తమలో గలిపికొన, రెండవవారు వెలిగానే యుంచిరి. నన్ను వెలివేసిన వారిలో జేరుటకు నే యత్నింపను లేదు. నన్నాంక్షపెట్టిన ఆ కుల స్వాములయెడ ఈసు వహింపను లేదు. వారు నన్నునిష్టునిగా జూచుచున్నను వారి మనస్సుల కేమి నొవ్వు కలుగునో యని నేను తొలగి మెలగుచుంటిని. వారి ఆంక్షలన్నిటికి నేను తలయొగ్గితిని. అత్తమామలు మున్నగు బంధువులుగాని, మా అక్కయు బావయుగాని తమ పంక్తిని నాకు భోజనమిడరాదు. వారి యిండ్ల నేను జలమేని ముట్టదగదు. వీరందరు చాటుమాటున నన్నాదరింపనెంచిరి కాని బహిరంగముగ చేయగూడని పని చాటుగా నొనర్చుటకే నంగీకరింపనైతిని.

నే నిట్లు జాగరూకతమై చరించుటచే గులమువారివలన నాకెట్టి యిక్కట్టును గలుగలేదు. నన్ను బహిష్కృతునిగా నెంచుచుండిన వారుగూడ నా యెడ దాక్షిణ్యమునే వహించి యుండిరి. కులమునకు నా వలన గాదగినది లేకున్నను వారునా కుపకరించుచునే యుండిరి. కొలమునకు ఎదు రొడ్డకుండుటచేతనే ఈ సత్ఫలితము కలిగెనని నేను విశ్వసింతును. అట్లు కాక నాకు వెలిచెల్లదని, నేను వివదించినను నా పక్షమునకు గొందర ద్రిప్పుకొనుటకై కొలమున నింకను చీలికలు కల్పించినను, కొలమువారికి ఆగ్రహము కల్పిం

చినను వారు నాపై పగబట్టి ప్రతిక్రియ చేయుటయు, నే నీ కొట్లాట సుడిగుండములలో జిక్కుకొనుటయు తటస్థించెడిది.

రాజకోటలో నేను ప్లీడరుపని చేయబూనినచో నవ్వులపాలయ్యెడివాడను. వకీలువృత్తి మొగమెరుగని నాకు మామూలుకంటె పదిరెట్లధికముగా ఫీజు కావలెనన్నచో నా చెంతకు వచ్చుటకు కక్షిదారులు బుద్ధిహీనులు కారుగదా.

బొంబాయిలో కొంతకాలముండి, హైకోర్టు వ్యవహారముల నాకళించుకొని, హిందూదేశపు లాను గ్రహించి, అచట నేమైన బేరము తగిలినచో రాబట్టుకొమ్మని స్నేహితులు కొందరు చెప్పిరి. ఆ ప్రకారము బొంబాయి కేగితిని గాని అచట నానాటికి పెరుగు వ్యయమునకు దగిన ఆయముగానక నాల్గయిదు నెలలు గడపుటే దుర్ఘటమయ్యెను. ఆనాళ్ళలోనే మమిబాయి అనునామె నా కొక 'స్మాలు కాజ్' దావాలోవకాల్తాఇచ్చెను. ఆ బేరము దెచ్చిన పోసుగుడుగానికి (Tout) కొంత సొమ్ము ముట్టజెప్పవలెననిరి. నేను ససేమిరా యీయనంటిని. వాని కేమియు నీయకయే ఆ దావా చేపట్టితిని. అది చాలా చిన్నదావా గావునను, ఒకనాటనే తేలిపోవునది గనుకను ముప్పది రొప్యముల ఫీజు కోరితిని.

స్మాల్‌కాజు కోర్టుకేగుట నా కదియే తొలిసారి. వాది సాక్షులను నే నడ్డుప్రశ్నలు వేయవలసియుండెను. అట్లు ప్రశ్నించుటకై లేచు సరికి నా కాళ్లు చల్లబడెను. నాకు తలత్రిప్పు జనించి, కోర్టంతయు గిర్రున తిరుగుచున్నట్లుండెను అడుగుట కేమియు దోచుటలేదు. జడ్జి లోలోన నెంత నవ్వుకొనెనో, తోడి

వకీళ్ళు నా దురవస్థ కెంతగా నానందించిరో! నా కేమియు గనుపించ లేదు. ఆసనమున గూలబడి ఆ వ్యవహారము నడపుట నావలన గాదనియు, శ్రీ పటేలుకు వకాల్తా యిమ్మనియు, నా కిచ్చినసొమ్ము తిరిగి యిత్తుననియు ఏజెంటుతో చెప్పితిని. రు ౫1 లు ఫీజిచ్చి శ్రీ పటేలుకు వకాల్తా యిచ్చిరి. ఆయనకా వ్యవహారము బాల క్రీడాప్రాయము.

నేను చరచర కోర్టు వెడలిపోతిని. ఆ దావా గెలిచెనో, ఓడెనో నాకది పట్టలేదు. నేను సిగ్గుచే క్రుగ్గిపోవుచుంటిని. దావాలు నడపుటకు దగిన ధైర్యము వచ్చువరకు మరి వకాల్తా పుచ్చుకొనరా దని నిశ్చయము చేసికొంటిని. నా కింగ్లీషులో మంచి ప్రవేశ మబ్బినది కావున ఏదైన స్కూలులో జేరి మెట్రిక్యులేషన్ చదువు బాలురకు ఇంగ్లీషు బోధించుట మంచిదని తోచెను. ఆ విధముగా కొంత సంపాదించినచో వ్యయభార మించుక తగ్గును. 'దినమున కొకగంట ఇంగ్లీషుబోధించు అధ్యాపకుడు కావలెను. జీతము రు 7౫ లు' అను ప్రకటన మొకటి కనులబడెను. పేరుజెందిన హైస్కూలు నుండి వెలువడినదా ప్రకటన. ఆ యుద్యోగమునకు విన్నప మంపు కొన్నంతట నాకు బిలుపువచ్చెను. నేను కొండంత యాసతో నేగితిని. నేను బి. ఏ. పట్టభద్రుడను గానని తెలిసినంతట ఆ స్కూలు ప్రిన్సిపాలు 'మీరు మాకు బనికిరారు' అని సవిచారముగ దెలిపెను.

'నేను లండను మెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గితిని. లాటిన్ భాషలో పరీక్ష యిచ్చితి' నంటిని.

'నిజమేకాని మాకు పట్టభద్రుడు కావలెను' అనె నాయన.

ఇక చేసెడి దేమున్నది? భగ్నాశుడనై తిరిగి వచ్చితిని. మా యన్న మనసుగూడ కలతపడెను. బొంబాయిలో నిక కాలహరణము చేసి ప్రయోజనము లేదని యిరువురము కూడబలికికొంటిమి.

అంతట బొంబాయికి నీళ్ళు వదలి, రాజకోట కేగి, అచట బల్ల కట్టి, సొంత ఆఫీసు పెట్టితిని. ఏదో కొంత మెరుగుగనే అచట కాలక్షేపమగు చుండెను. దరఖాస్తు విన్నపముల మసాయిదాలతో నెలకు సగటున మున్నూరు రౌప్యములు రాలుచుండెను. దీని కంతకు గారణము నా ప్రయోజకత్వము కాదు. నా సోదరుని భాగస్వామి అచటి వకీళ్ళలో ప్రాతకాపు గావున ముఖ్యమైన అర్జీలు మున్నగునవి ఆయన పెద్ద పెద్ద బారిస్టర్లకు బంపుచున్నను పేదపార్టీల అర్జీలు నాకడకు బంపెడివాడు. అదియే నా రాబడికి మూలము.

## 16

## ప్రథమాఘాతము

పోరబందరు రాణావారు గద్దెనెక్కుటకు మున్ను మాయన్నవారికి సలహాదారుగా నుండి సాచివ్యము నెరపెను. రాణావారికా కాలమున చెడు సలహా యిచ్చెనని యిపుడు మాయన్నపై దోషారోపణము జరగెను. ఆ వ్యవహారమును విచారణచేయుచున్న పొలిటికల్ ఏజెంటుకు మాయన్న యెడ దుర్భావ మంకురించెను. సీమలో నున్నపుడా యేజెంటుకు, నాకు ఎరుకగలదు. నాకాయన కడ సీమలో కొంతచనవుగూడ ఏర్పడెను. ఆ యెరుకను పురస్కరించుకొని నే నా యేజెంటు చెంతకేగి మాయన్నపై నేర్పడిన

దుర్భావమును తొలగించి మంచి చేసికొనుట యుక్తమని మాయన్న తలపోసెను. నాకిది మనస్కరించినది కాదు. ఆ యల్ప పరిచితిని నేనిట్లుపయోగించుకొనుట కూడని పని. నా సోదరుడు దోషి యగుట నిక్కమేని నా పురస్కృతి యేమి సేయగలదు? అట్లుకాక నిర్దోషి యగునేని తగుదీతిని విన్నప మంపికొని ఏమి కానున్నదో ఎదురు చూడవలెను. మా యన్నకు ఈ నా వైఖరి నచ్చలేదు. 'నీకు లోకానుభవము చాలదు. కధియవాడన నేమనుకొంటివో; ఇచట పలుకుబడి లేని ఏ పనులుగావు. నాకు దమ్ముడవై యుండి, నీ కెరుక యున్న అధికారితో నా కొరకొక మంచిమాట చెప్పక తప్పించుకొనుట యుక్తముకాదు' అనెను.

ఆయనమాట కాదనలేక పోతిని. ఈ పనిబూని ఆ యధికారి చెంతకేగుట తగదని యెరిగియు, నా గౌరవమున కిది లోపమని తెలిసియు ఆయన యెదుట బడితిని. ముందుగా ప్రాత పరిచయము దిరుగవేసితిని. వెంటనే నా కిది యింగ్లండుగాదు. కధియవాడ యని తెలిసి వచ్చెను. సెలవులతరి ఆయన సీమలో నుండుటకు, నిచట అధికారి పీఠమున నుండుటకు భేదమున్నదని గ్రహించితిని. మాపూర్వపరిచితి నాతడు కాదనలేదు గాని దాని నాదకు తెచ్చుటచే బిఱ్ఱబిగిసెను. 'ఆ పరిచితిని దుర్వినియోగము సేయవచ్చితివా?' యను భావ మాతని మోమున అచ్చుగ్రుద్దినట్లు వ్రేలుచు, ఆ బిఱ్ఱబిగియుటను వ్యాఖ్యానించుచుండెను. అట్లయ్యు, నేను వచ్చిన పనిని గూర్చి చెప్ప నారంభించితిని. నే చెప్పుదానిని కడముట్ట విను నోపికలేక ఆతడు 'మీ యన్న వట్టి తంత్రగొట్టు. నే నింక నేమియు విన నొల్లను. వినుటకు దీరుబడియు లేదు. మీ యన్న

చెప్పికొనవలసిన దేమేని యున్నచో దగు మార్గమున జెప్పికొనవచ్చును' అనెను. నా కా మాటలు చాలును. జరుగవలసిన శాస్తియే నాకు జరిగినది. స్వార్థపరత గ్రుడ్డిదికాన నేనింకను నేమో చెప్పదొడగినంతట ఆతడు లేచి, 'మీరింక వెళ్లవచ్చు' ననెను.

'నన్ను పూర్తిగా చెప్పనిండు' అంటిని. ఆయన మండి పడుచు నౌకరును బిలిచి నన్ను వెలుపలికి బంపుమని చెప్పెను. నే నింకను వెనుకముందాడుచుండగా నౌకరు నా బుజముపై చేతులు వైచి గది వెలుపలికి బంపెను.

ఏజెంటు సాహెబు, నౌకరు నటనుండి వెడలిపోయిరి. నేనును సెగలుపొగలు గ్రక్కుచు వెడలిపోతిని. 'మీరు నన్నవమానించితిరి. మీ నౌకరుచే నన్ను గెంటించితిరి. దీనికి పరిహారము సేయనిచో మీమీద తగు చర్య జరుపవలసియుండును' అని చీటివ్రాసి పంపితిని.

వెంటనే ఒక ఆశ్వికునిచే నాత డిట్లు బదులువ్రాసి పంపెను:

'మీరు విరసముగా వర్తించితిరి. నేను వెడలిపొమ్మన్నను పోవకుంటిరి. నేను చేయునది లేక నౌకరును పిలిచి మిమ్ము బయటికి బంపుమంటిని. ఆతడు 'వెడలిపొం'డని చెప్పినను మీరు కదలలేదు కావున నాతడు తగుమాత్రము ఒత్తిడిచేసి మిమ్ము వెలుపలికంపెను. మీచిత్తమువచ్చిన చర్య జరుపవచ్చును.'

ఈ ప్రత్యుత్తరము నందికొని, లజ్జావిహీనుడనై యింటికేగి జరిగినదంతయు మా యన్నకు వినుపించితిని. ఆయనయు జాల ఖేద పడెను. నా కెట్టియూరట చెప్పుటకు ఆయనకు తోచలేదు. ఏజెంటు సాహెబుపై జరుపదగిన చర్యను మిత్రులగు వకీళ్ళతో సంప్రదించి

చూచెను. ఆ సమయముననే శ్రీ ఫిరోజిషా మెహతా బొంబాయి నుండి రాజకోట కేదో పనిమీద వచ్చియుండెనుగాని కట్టుబారిష్టరును నే నాయన యెదుటి కేగ సాహసించుటెట్లు ? బొంబాయినుండి వారిని తీసికొనివచ్చిన వకీలు చేతికి నావ్యవహారపత్రము లిచ్చి శ్రీ మెహతా ఏమిఆలోచన చెప్పునో కనుగొనుడని పంపితిని. 'చాలమంది వకీళ్లకు, బారిష్టర్లకు నిట్టివి క్రొత్తవి కావు అని గాంధితో చెప్పుము. ఆతడు క్రొత్తగా ఇంగ్లండునుండి దిగినవాడు గావున ఇంకను క్రాగి చల్లార లేదు. బ్రిటిషు అధికారుల వైఖరి ఆత డెరుగడు. ఏదో ఇంత సంపాదించుకొనుచు సుఖముగా నిచట నుండదలచిన చో ఈ కాగితములు చింపివైచి అవమానమును దిగ మ్రింగుట మంచిది. ఏజెంటు సాహెబుపై చర్య జరిపినచో నది యెదురు తిరిగి తనకే చెఱుపు ఘటించునని చెప్పుము. ఆతని కింకను లోకానుభవము చాలదు ' అని శ్రీ మెహతా చెప్పి పంపెను.

శ్రీ మెహతా చెప్పిన సలహా విషప్రాయ మైనను మ్రింగక తప్ప దయ్యెను. నాకు ప్రాప్తించిన ఈ యవమాన మూరకపోక నాకు లాభమే చేకూర్చెను. 'ఇక నెన్నడు ఇట్టి అనుచితమున కొడిగట్టి మైత్రిని దుర్వినియోగము చేయను.' అని ప్రతిన బూనితిని. దాని కెన్నడు నింతవరకు భంగము చేయలేదు. ఈ యాఘాతముతో నా జీవితము క్రొత్తదారి బట్టెను.

మొదలు నే నా యధికారిచెంత కేగుట దోసమే కాని ఆతడంత దురహంకృతిని, అసహనమును తాల్చదగినది కాదు. నన్ను వెలుపలికి గెంటించుట బొత్తిగా కూడనిపని. తెలవారినది మొదలు నాకున్న వ్యవహారమంతయు ఆయన కోర్టులోనే. కాని ఆయన

యనుగ్రహము నే సంపాదింప నొల్లను. నీ పై చర్య జరుపుదు నని ఆయనను బెదరించి మిన్నకుండను నేరను.

ఈలోపల కథియవాడు నందలి రాచకార్యముల నాకళించుకొన నారంభించితిని. కథియవాడు చిన్నచిన్న సంస్థానముల కూడలి యగుటచే నది కుతంత్రముల కాలవాలముగా నుండెను. సంస్థాన పతులందరు పరాధీన జీవనులై, కొండెగాండ్రకు, బట్టు పోగ్డలకు చెవి యొగ్గుచుండిరి. ఏజెంటుసాహెబు నౌకరునుగూడ వారు మంచిచేసికోవలసినదే. ఇక శిరస్తాదారుమాట చెప్పెడి దేమి? సాహెబుకంటె నాతడే మేటి. సాహెబు కాతడే కనులు చెవులు నై దుబాసిగా వ్యవహరించును. ఆతని చిత్తమున కెదురు లేదు. సాహెబు రాబడికంటె ఆతనిదే అధికమని ప్రతీతి. ఇందతిశయోక్తి కొంత యున్నను ఆతని జీతమునకు, అనుభవించు రాచభోగమునకు బొత్తు లేదు.

ఈ విషవాయువుల మధ్య నే నెట్లు మనగలనో తోచలేదు. నే నిట్లు దిగులుపడి కూరుచుండుట మా యన్న గ్రహించెను. ఏదైన యుద్యోగముదొరకినచో నే నీకుతంత్రజంబాలమునుండి బైటపడవచ్చు నని మేమిద్దరము ననుకొంటిమి. మంత్రిత్వమో, న్యాయాధిపతిత్వమో కావలెనన్నచో గుతంత్రము కావలెను. పోనీ, ప్లీడరు వృత్తినే చేసికొందుననిన ఏజెంటు సాహెబుతో వైరమాయెను. ఎటు జూచి నను దారిలేదు.

ఇంతలో పోర్బందరునందలి మేమన్ వర్తకులు మాయన్న కొక జాబు వ్రాసిరి: 'దక్షిణాఫ్రికాలో మాకొక వ్యవహారమున్నది. మాది పెద్ద వ్యాపారము. 40000 పౌనుల సొమ్ము రాబట్టుకొనుటకు

అచటి కోర్టులో మాది ఒక దావా చిరకాలమునుండి నడచుచున్నది. అచట పెద్ద వకీళ్ళకు, బారిస్టర్లకు వకాల్తా యిచ్చితిమి. మీ తమ్ముని అచటి కంపినచో ఆయనకు, మాకు గూడ ఉపయోగ ముండును. మా వ్యవహారము నచటి లాయర్ల కాయన మాకంటె బాగుగా విప్పిజెప్పగలడు. క్రొత్తదేశములు చూచి, క్రొత్తపరిచితుల సంపాదించుకొనుట కాయన కిది యదను.'

నే నంతట వారిని 'నే నచట నెంతకాలము ఉండవలెను ? నా కేమి యిత్తురు ?' అని యడగితిని.

వారు 'అచట నొకయేడున్నచో జాలును. మొదటి తరగతి ప్రయాణ వ్యయము, అచటి సకల వ్యయములు భరించి 105 పౌను లిచ్చెద' మనిరి.

నేను దీనికి సమ్మతించి వెళ్ళుట ఆ వ్యాపారుల నౌకరుగా వెళ్ళుట యగునే కాని బారిస్టరుగా వెళ్ళుట కాజాలదు. మరి యీ దేశమును వీడిపోవలెనన్నచో మార్గాంతరము లేదాయెను. క్రొత్త సీమలు చూచి, నూతానుభవము గడింపవచ్చునుగదా యని మనసు పెరపెరలాడెను. అదియును గాక నేను 105 పౌను లింటికి పంపవచ్చును. దానిచే మాయన్నకు సంసారభారము కొంత తగ్గును. కావున వారితో మరి బేరసారములకు దిగక, సమ్మతించి మూట ముల్లె కట్టి ప్రయాణమునకు సిద్ధమైతిని.

# చతుర్థ భాగము : దక్షిణాఫ్రికాలో

## 17

## దక్షిణాఫ్రికా చేరుట

నేటాలు భూమికి దర్బాను రేవుపట్టణము. దానిని నేటాలు రేవనుటయు గద్దు. సేట్ అబ్దుల్లా రేవులో నాకొరక ప్రతీక్షించుచుండెను. నూతనాగతుల కోసము ఓడలోనికి వచ్చినవారిని చూడగా, నచటివారికి హిందూదేశస్థుల యెడ గౌరవ మంతగా లేదని తెలిసివచ్చెను. సేట్ అబ్దుల్లా నెరిగియున్నవా రా యనను చిన్నచూపుగా జూచుట నాకనుల బడినంతనే నా మనసు చివుక్కుమనెను. అబ్దుల్లా కది పరిపాటియైపోయెను. 'ఈతడెవ్వడో ?' యని కొందరు నా యెడ వింతచూపులు బరపుచుండిరి. అచట భారతీయుల వేషము కంటె నాది విలక్షణముగా నుండెను. నేను ఫ్రాకు కోటు ధరించి, వంగదేశపు పగ్గీ వంటిది తలకు జుట్టుకొనియుంటిని.

నేను చేరిన రెండు మూన్నాళ్ళకు అబ్దుల్లా నన్ను దర్బాను కోర్టుకు దీసికొనిపోయెను. అచట చాలమందికి నన్నెరుక పరచి తన లాయరు (Attorney) చెంత నన్నాసీను నొనర్చెను. మాజస్ట్రీటు కొంతసేపు నావంక తేరిపారజూచి తుదకు నన్నా తలపాగ తీసివేయుమనెను. నేను నిరాకరించి, వెడలిపోతిని.

ఇచట గూడ నాకు కలహము తప్పదుగాబోలు ననుకొంటిని. ఈ తలపాగ వృత్తాంతమును గూర్చి పత్రికలలో ప్రకటించితిని. కోర్టులో నేను దానిని ధరించుట యుచితమే యని అందు సమర్థించుకొంటిని. ఈ విషయమై పత్రికలలో సందడి రేగెను. పత్రికలు నాకు 'పిలువని చుట్టము' అని పేరు పెట్టెను. ఈ రీతిగా దక్షిణాఫ్రికాలో నే నడుగిడిన కొలదినాళ్ళకే ప్రసిద్ధుడనైతిని. ఆ దేశమును నేను విడిచివచ్చునందనుక నేను తలపాగను విడువలేదనియే చెప్పవచ్చును.

## 18

## ప్రిటోరియాకు

'దావా వ్యవహారము సిద్ధము చేయుటకు మీరుగాని, మీ ప్రతినిధి గాని వెంటనే ప్రిటోరియాకు రావలసిన' దని సేటు అబ్దుల్లా కచేరి లాయర్లు జాబు వ్రాసిరి. అబ్దుల్లా ఆ జాబు నాచే చదివించుకొని 'మీరు వెళ్ళెదురా?' యని అడిగెను. 'దావాను గూర్చి నా కింకను ఆకళింపు కాలేదు. దాని స్వభావమును ముందు వివరింపు' డంటిని. సేట్జీ యంతట తన గుమాస్తాలచే వ్యవహారమంతయు ఆకళింపు చేయించెను.

•

దర్బాను చేరిన ఏడెనిమిది దినములకే మరల పయనమైతిని. నాకు మొదటి తరగతి టికెట్టు కొనిరి. మరి ౫ షిల్లింగు లిచ్చి పడుకకుగూడ ఏర్పాటు చేయుదు నని అబ్దుల్లా చెప్పగా పట్టుదలచే అభిమానముచే ౫ షిల్లింగులు పొదుపుచేయు లోభముచే నాకు పరపు

వలదంటిని. అబ్దుల్లా 'మీరిచటి పద్ధతు లెరుగరు. ఇది ఇండియా కాదు. నామాట వినుడు. వ్యయమగునని మీరు వెనుదీయకుడు. సొమ్మునకు మనకు లోపము లేదు' అని చాల దూరము చెప్పినను నేను 'నాకొరకు' ఆలజడి చెందకుడు అని ఆయన హితోక్తి విననైతిని.

రాత్రి 9 గంటలవేళ మా రైలు నేటాలు రాజధానియగు మారిట్జు బర్గు చేరెను. కావలసిన వారి కిచట పడుకకు పరపు లిత్తురు. రైల్వే యుద్యోగి యొకడు వచ్చి 'మీకు పరపు కావలెనా?' యని నన్నడిగెను. 'నా చెంత పరపున్నదిలెమ్ము' అంటిని. ఆతడు వెడలిపోయెను. పిమ్మట నొక ప్రయాణికు డేతెంచి నన్నెగదిగ బరికించెను. నేను నల్లని వాడనగుట చూచి చిడిముడిపాటున దిగిపోయి, ఒక రిద్దరు ఉద్యోగుల వెంట నిడుకొని వచ్చెను. వారు కొంతసేపు మిన్నక యున్నంతట మరి యొక యుద్యోగి యేతెంచి, నాతో 'నీవు సామానుల పెట్టెలోనికి బోయి కూర్చుండు' మనెను.

'నాది మొదటి తరగతి టికెట్టు' అంటిని.

ఆతడు 'కావచ్చును. నువ్వు సామానుల పెట్టెలో కూర్చుండవలెనని చెప్పుచుంటిని గదా' యనెను.

'దర్బానులో నన్నీపెట్టెలో ఎక్కనిచ్చిరి. నే నిందులోనే వెళ్ళవలయు' నని బదులాడితిని.

'అట్లు వీలుపడదు. నీ వీ పెట్టెనుండి దిగిపోవలెను. లేనిచో పోలీసులచే నిన్ను గెంటింతును'.

'అట్లే చేయుడు. నాయంతట నే దిగిపోను'.

పోలీసుకానిస్టేబులు వచ్చెను. నా చేయి పట్టుకొని బయటికి లాగెను. నా సామానులు గూడ దింపివేసెను. నేను మాత్ర మావలి పెట్టె నెక్కుటకు నిరాకరించి **అచట**నే యుంటిని. ట్రెయిను వెడలి పోయెను. నా సామాను లక్కడనే విడిచి, చే సంచితో వెయిటింగు గదిలోని కేగి కూరుచుంటిని. రయిల్వే అధికారులా సామాను తమ యధీనము నందుంచికొనిరి.

అది చలి కాలము. దక్షిణాఫ్రికాలోని ఆ యున్నత భూము లలో చలిగాలి పండ్లు కొరుకుచుండెను. నా చలికోటు పెట్టెలో నున్నది. దానిని తీసికొందునని యో మరల నవమానింతురేమో యను సంశయముచే నట్లే వణకుచు ముడిచికొని కూరుచుంటిని. ఆ గదిలో దీపముగూడ లేదు. నడిరేయివేళ నెవడో ప్రయాణీకుడు గదిలోనికి వచ్చి నన్ను బలుకరించెను గాని నేనాతనితో సంభాషిం చెడి స్థితిలో లేను.

ఇపుడు కర్తవ్యమేమి? ఇచట నా హక్కుల కొరకు బోరా డుదునా, వచ్చినదారినే ఇండియాకు మరలిపోదునా? ఈ యవ మానములను లెక్కింపక, ప్రిటోరియా వెళ్ళి, అచట నా పని ముగించుకొని పిమ్మట స్వదేశమున కేగుదునా? నేను వచ్చినపని పూర్తిచేసికొనకుండ ఇండియా కేగుట పిరికితన మనిపించుకొనును. నా కిచట దాపురించిన యగచాట్లు — ఇచటివారికి మేన జనించిన వర్ణవిద్వేష వ్యాధికి బాహ్యలక్షణములు మాత్రమే. చేతనైనచో నేను కడగండ్ల కోర్చి ఈ వ్యాధిని నిర్మూలింపవలెను. ఈ వర్ణ ద్వేషముచే గొన్ని నష్టకష్టము లొదవుచున్నవి. వానిని తొలగించు కొన్నచో జాలును.

తరువాత రానున్న రైలుబండిలో ప్రిటోరియా కేగ నిశ్చయించితిని. రైల్వే సర్వాధికారికి మరునాడుదయమున బెద్ద తంతి వార్త పంపి, ఆ విషయము సేట్ అబ్దుల్లాకు గూడ దెలిపితిని. వెంటనే అబ్దుల్లా ఆ యధికారిని కలసి మాటలాడెను. రైల్వే అధికారి తన యుద్యోగుల చర్యను సమర్థించి, గాంధిని గమ్యస్థానము చేర్చు ఏర్పాటు చేయవలసినదిగా స్టేషన్‌మాస్టరుకు ఆజ్ఞ యిచ్చితినని అబ్దుల్లాకు తెలియజెప్పెను. అబ్దుల్లా యంతట మారిట్జుబర్గులోని భారత వర్తకులకును, ఇతర ప్రదేశములందున్న మిత్రులకును గాంధీని గలిసికొని, వారి సౌకర్యములు విచారింపుడని తంతివార్తలంపెను. ఆ వర్తకులు స్టేషనులో నన్ను జూడవచ్చి, ఇటువంటి కష్టములు దామందరు ననుభవించినవేయనియు, నిందు క్రొత్త లేదనియు నాకు బరామరిక మాటలు చెప్పిరి. ఒకటిరెండు తగగతులలో ప్రయాణముచేయు భారతీయులకు తెల్ల బాటసారులచే, రైల్వే యుద్యోగులచే నిట్టి కష్టము లున్నవేయనిరి. ఆ కష్టగాథాశ్రవణముచే బవలు గడచినంతట రైలుబండి వచ్చెను. అందు నాకొరకు జోటు ప్రత్యేకించి యుంచిరి. దర్బానులో వలదని నిరాకరించిన పడుక యేర్పాటున కిచట టికెట్టు కొంటిని.

తెలవారుసరికి ట్రెయిన్ను చార్లెస్‌టవును చేరినది. అటనుండి జొహాన్సుబర్గ కప్పటికి రైలుమార్గము లేదు. అంచె బండ్లలో ప్రయాణము చేయవలెను. ఆ బండి త్రోవలో స్టాండర్టను నందు రాత్రి వేళ ఆగును. అంచెబండికి నా వద్ద టికెట్టు కలదు. మారిట్జుబర్గులో నొకదిన మాగిన కారణమున నా టికెట్టు రద్దు

కాలేదు. చార్లెస్‌టవునులో అంచెబండ్ల యేజెంటుకు గూడ అబ్దుల్లా తంతివార్త పంపెను.

ఆ యేజెంటు ఏదియో మిషతో నన్ను వారించువాడై, నా క్రొత్తవాలకమును గనుపెట్టి 'నీ టికెట్టు రద్దయిపోయిన' దనెను. నేను తగు రీతి బదులు చెప్పితిని. ఇంతకు, బండిలో జోటులేక కాదు; ఆత డట్లు చెప్పుటకు కారణము వేరుగా నున్నది. బాట సారులు బండిలో కూర్చుండవలెను. నేను 'కూలీని' క్రొత్తవాడను గావున బండిలో దెల్లవాండ్రతో గలసి కూర్చుండ దగదని శకటపాలకుడగు తెల్లవానికి దోచెను. బండి తోలెడివాడు కూర్చుండు చోటున కిరు దెసల రెండు ఆసనము లున్నవి. అందొక దానిపై ప్రతి దినము గూర్చుండు శకట పాలకుడు తా నా నాడు లోపల గూరుచుండి, తన చోటు నా కొసగెను. ఇది అన్యాయము, అవమానము నని యెరిగియు, నేను మిన్నకుండుటే మేలను కొంటిని. నేను బలాత్కారముగ లోపల జొరబడలేను. కాదు కూడదని జగడమునకు దిగుదునేని బండిదారిని బండి నన్ను వదలి వెడలి పోవును. మరల నొకదినము వృధా గడచిపోవును. ఆ మరునాడు మరల నేమి మునుగునో దైవమునకే యెరుక. కావున లోలోపల గుమిలిపోవుచు బండి తోలెడివాని చెంత గూరుచుంటిని.

మూడు గంటలగు సరికి బండి పార్డికాఫ్ చేరెను. శకట పాలకున కపుడు పొగ ద్రాగుటకు, గాలిపోసికొనుటకు నాచోటు కావలసి వచ్చెను. బండివాని నడిగి మురికి గోనెగుడ్డ తీసికొని, దానిని పాదములుంచుకొను చోట పరచి, శకటపాలకుడు నాతో 'సామీ! నీ వా గోనెగుడ్డపై గూర్చుండుము. నేను బండివాని చెంత గూరు

మందు ' ననెను. ఆ యవమానము భరింపలేక, భయముచే నిలువున గంపించుచు, 'లోపల గూరుచుండవలసినవానిని నీవే మొదలిచట గూరుచుండ బెట్టితివి. నే నా యవమానము సహించితిని. నీవిపుడు పొగ త్రాగవలసి నన్ను నీ పాదములచెంత గూలబడుమనుచున్నావు. వలసినచో లోని కేగుదునుగాని ఇచట గూరుచుండ ' నంటిని.

ఈ వాక్యము లతి కష్టముమై నా నోట వెడలుచుండగనే ఆతడు నా మీదికి వచ్చి నా గూబ లదరునట్లు ఎడపెడ వాయింప జొచ్చెను. నా జబ్బ పట్టుకొని క్రిందికి లాగనొడగెను. నేను బండి చువ్వలను గట్టిగా పట్టుకొని, ముంజేతి యెముకలు విరిగినను సరియే. ఆ పట్టు విడువగూడదని నిశ్చయించుకొంటిని. వాడు నన్ను దుర్భాష లాడుచు, పడలాగుచు, గొట్టుచుండ నేను కదలక అట్లేయుంటిని. ప్రయాణికు లిది యెల్ల మిన్నక చూచుచుండిరి. వా డేమో బల శాలి. నేను దుర్బలుడను. బాటసారులలో గొందరికి జాలిపుట్టి 'ఓయీ! ఆతని వదలుము. ఎందు కట్లు కొట్టెదవు? ఆతని వలన నోసము లేదు. ఆత డన్నది యథార్థమే. అచట గూరుచుండ లేనిచో ఆతని లోనికి రానిమ్ము' అని కూకలిడిరి. వాడు 'ప్రమాద మేమియు లేదు' అని యఱచెనుగాని ఇంచుక సిగ్గుపడి నన్ను గొట్టుటమాని, నా చేతిని వదలిపెట్టెను. నన్ను మరలగొన్ని దుర్భాషలాడి, బండివానికి రెండవదెస గూరుచున్న హాటెంటాటు నౌకరును క్రింద గూరుచుండ నిడి, తాను వాని చోటున కేగి ఆసీనుడయ్యెను.

బాటసారు లెవరిచోటునకు వా రేగిరి. ఈలవైచినంతనే బండి సాగిపోయెను. నా గుండెలు దడదడ గొట్టుకొనుచుండెను.

ప్రాణములతో గమ్యము చేరుదునో, లేనో యనుకొంటిని. వాడు ఎడనెడ నా దెస చురచుర జూచుచు, తర్జని ఝుళిపించుచు, 'స్టాండర్టను చేరనిమ్ము. ని న్నేమి చేయుదునో' అని పుసరుస లాడు చుండెను. పరమేశ్వరా! నన్ను రక్షింపుమని వేడుకొనుచు నేను మారుపలుకకుంటిని.

స్టాండర్టను చేరుసరికి చీకటిపడెను. అచట కొన్ని భారతీయ ముఖములు కనుపించినంతట 'బ్రదుకుజీవుడా' యనుకొంటిని. నేను బండి దిగగానే వారు 'మేము మీకొరకే వచ్చితిమి. అబ్దుల్లాదాదా తంతివార్తపంపెను. ఈసాసేటు దుకాణమున కేగుదమురండు' అనిరి. నేను సంతోషముతో వారివెంట సేట్ ఈసాహాజీసుమాన్ దుకాణ మున కేగితిని.

అంచె బండ్ల కంపెనీ యేజెంటుకు వ్యవహారము దెలుపుట మంచిదని యెంచి, జరగిన దంతయు నొక జాబున లిఖించి 'మీ వ్యవహర్త నన్నిట్లు బెదరించె' నని కూడ తెలియజేసితిని. మరునాడు మరల బండి బయలుదేరునపుడు అందరితోపాటు నన్ను లోపల గూరుచుండ నిచ్చునట్లు మాటయిండని కోరితిని. ఏజెంటు నా కిట్లు బదులు వ్రాసి పంపెను:-'స్టాండర్టనునుండి పెద్దబండి బయలుదేరును. నిన్నటి మానిసి యచట నుండడు. క్రొత్తవాండ్ర యధీనమున బండి సాగును. అందరితోపాటు మీరు బండిలోనే కూరుచుండు ఏర్పాటు చేయుదును.' దీనిచే నాకు గొంత యూరట లభించెను. నా పై జేయి చేసికొన్న వానిపై చర్య నడపు ఆలోచన నాకు లేదు గావున ఆ యత్యాచార కథ యంతటితో ముగిసెను.

వేకువనే ఈసాసేటు తమ వారిలో నొకరిని వెంటనంప బండి కడకేగితిని. నాకు మంచిచోటే చూపించిరి. ఆ రాత్రికి సుఖముగా జోహాన్సుబర్గు చేరితిని.

స్టాండర్టను చిన్న పల్లె. జోహాన్సుబర్గు పెద్ద పట్టనము. అబ్దుల్లా అచటికి గూడ తంతివార్త పంపెను. మహామ్మదు కాసిం క్రముద్దీను దుకాణమున కేగుడని నాతో చెప్పెను. క్రముద్దీనుసేటు నా కొరకు తన మనుజు నంపెను గాని సన్నాతడు, ఆతని నేను గురుతింప మైతిమి. అచట హోటళ్ళ పేర్లు నే నెరుగుదును గాన అందొకచో బసచేయ నెంచి గ్రాండు నేషనల్ హోటలుకు గుర్రపు బండి మాటలాడుకొంటిని. అచటి కేగి హోటలు యజమానితో నా కొక గది ఇమ్మంటిని. ఆత డొక్క క్షణము నా దెస నిదానించి చూచి, 'గదులు నిండిపోయినవి. ఏమి చేతు' నని నొచ్చుకొనుచు నన్ను సాగనంపెను. నే నంతట బండివానిని సేట్ క్రముద్దీను దుకాణమునకు బండి పోనిమ్మంటిని. అచట నాకొరకు కనుపెట్టుకొనియున్న అబ్దుల్గనీసేటు నన్ను మిగుల నాదరించెను. హోటలులో జరగిన ముచ్చట దెలుపగా విని ఆయన 'హోటలులో మీకు బస యిత్తురని ఎట్లనుకొంటి' రని విరుగబడి నవ్వెను.

'ఎందు కీయ ' రంటిని.

'నెమ్మదిమీద అంతయు మీకే తెలియును '

అనుచు సేట్జీ 'ఇటు వినుడు. రేపు మీరు ప్రిటోరి.గా కు వెళ్ళవలసియున్నది. మూడవతరగతి బండిలోనే పోవలసి యుండును. ట్రాన్సువాల్ స్థితిగతులు నేటాలుకంటె పాడుగా నుండును. ఒకటి

రెండు తరగతుల టిక్కెట్లు భారతీయులకు మొదలే ఈయరు ' అని తెలిపెను.

రైల్వే నిబంధనలు తెప్పించి వానిని పరిశీలించి చూడగా నందొకించుక పొరసందు కనిపించెను. ట్రాన్స్‌వాల్ పూర్వశాసనములలోని భాష అస్పష్టముగా నోష జుష్టముగా నుండును. రైల్వే నిబంధనల భాష అంతకంటె అధ్వాన్నముగా నుండును.

నే నంతట సేట్జీతో ' నాకు మొదటి తరగతిలోనే పోవలెనని యున్నది. వీలుకానిచో గుఱ్ఱపుబండి చేసికొని పోవుదును. ప్రిటోరియా యిచటికి 37 మైళ్లేకదా ' యంటిని.

బండి ప్రయాణ మాలస్య మగుననియు, అధిక వ్యయ కారణ మనియు చెప్పి సేట్జీ మొదటి తరగతి రైలు ప్రయాణమునకే సమ్మతించెను. స్టేషన్ మాష్టరు కంతట నొక చీటి వ్రాసి పంపితిమి. నేను బారిష్టరు ననియు, మొదటి తరగతి ప్రయాణ మలవాటనియు నందు వ్రాసితిని. నేను వెంటనే ప్రిటోరియా చేరవలసి యున్నది గాన జవాబు వచ్చువరకు వేచియుండజాల ననియు, స్టేషనులోనే మాటలాడుదు ననియు, మొదటి తరగతి టికెట్టు ఇత్తురని నమ్ముచుంట ననియు ఆ లేఖలో తెలిపితిని. స్టేషనులో స్వయముగా మాటలాడుదునని వ్రాయుటలో నొక రహస్య మున్నది. స్టేషనుమాష్టరుకు బదులు వ్రాయుట కవకాశమిచ్చినచో, నేను కూలీబారిష్టరును గాన 'లేదు పొమ్మని వ్రాయును. నేను అచ్చపు టింగ్లీషు దొరవేసముతో నెదుటబడి మాటలాడినచో ఆతడు మొదటితరగతి టికెట్టు ఇచ్చునని నే నాలోచించితిని. ఈ యాలోచనతో నేను ఫ్రాక్

కోటును, గళబంధమును దాల్చి స్టేషనుమాష్టరు చెంత కేగి బంగారు కాసును బల్లపై నిడి, మొదటితరగతి టికెట్టు నిండంటిని.

'ఆ చీటి యంపినది మీరలేనా?'

'అవును. నేడే నేను ప్రిటోరియా చేరవలెను. టికెట్టు ఇచ్చినచో నాకు మహోపకారము చేసినవా రగుదురు.'

ఆత డించుక జాలిచెంది, చిరునవ్వు నవ్వి, 'నేను ట్రాన్సువాల్ మానిసిని కాను. నాది హోలండు. మీ మనోవేదనలను గ్రహించుకోగలను. మీయెడ నాకు సానుభూతి కలదు. మీకు టికెట్టు ఇత్తును గాని గార్డు వచ్చి మిమ్ము మూడవ తరగతిలోనికి బొమ్మన్నచో, రైల్వేకంపెనీతో మీరు వివాదమునకు దిగినయెడల నద నా కంఠమునకు జుట్టుకొనును. నాకు చిక్కు తెచ్చిపెట్టనని మాట యిండు. మీరు సత్పురుషులు. మీ ప్రయాణము సుఖముగా సాగుగాక' అనుచు టికెట్టు నిచ్చెను. ఆతడు కోరినట్లు మాట యిచ్చి నాకు మేలుచేసితి రంటిని.

సేట్ అబ్దుల్లనీ నన్ను సాగనంపుటకై స్టేషనుకు వచ్చెను. నేను టికెట్టు సంపాదించినందుల కాయన సంతోషమును, నాశ్చర్యమును చెందియు నిట్లనెను. 'మీరు ప్రిటోరియాకు సుఖముగా చేర గలిగినచో సంతోషమేకాని గార్డు మిమ్ము నున్నచోట నుండనీయ డేమో. ఆత డూరకయున్నను ప్రయాణికులు ఊరక యుండ'రనెను.

నేను మొదటి తరగతిలో నాసీనుడనైతిని. బండి బయలు దేరెను. జెర్మిస్టను వద్ద టికెట్లు పరీక్షించుటకై గార్డు వచ్చెను. అచటనున్న నన్నుగాంచి కనలుచు మూడవ తరగతిలోనికి వెంటనే

లేచిపొమ్మని తర్జనితో సన్న చేసెను. నా మొదటి తరగతి టికెట్టు చూపెట్టితిని. 'దాని కేమిలే, ముందు మూడవ తరగతికి నడువు' మనెను.

ఆ పెట్టెలో ఇరువురమే పయనించుచుంటిమి. రెండవ యాత్ర ఆంగ్లేయుడు. ఆతడు 'ఆయన నేల ఇబ్బంది పెట్టెదవు? మొదటితరగతి టికెట్టు చూపించెను గదా. ఆయన ఈ పెట్టెలో నుండుటకు నా కెట్టి యాక్షేపము లేదు' అని గార్డును మందలించి, నావంకకు జూచి 'మీరు సుఖముగా కూరుచుండుడు' డని పలికెను. గార్డు 'కూలీ సరసను కూర్చుండుట మీ కిష్టమైనచో నా కేమి పోయిన' దని గొణిగికొనుచు వెడలిపోయెను.

రాత్రి ఎనిమిది గంటలకు ప్రిటోరియా చేరితిని.

## 19

## ప్రిటోరియాలో మొదటి దినము

1893 నాటి ప్రిటోరియా స్టేషనుకు 1914 నాటి దానికి పోలికయే లేదు. దీపములు మసక మసకగా వెలుగుచుండెను. బాటసారులును పెక్కురు లేరు. బాటసారులందరు వెడలిపోయిన పిమ్మట స్టేషన్ మాస్టరును, నా కెచటనేని చిన్న హోటలులో బస దొరకునేమో అడుగుదమని వేచియుంటిని. బస దొరకనిచో ఆ రేయి నేను స్టేషన్‌లోనే గడపవలసి వచ్చును. ఈమాత్రమేని అడుగుటకు — ఎచట అవమానించిపోవునో యని—నాకు లోపల డక్కుగానే యుండెను.

ప్రయాణికులు వెడలిపోయిరి. స్టేషన్ మాస్టరుకు టికెట్టు నిచ్చి, బస విషయమై ప్రస్తావించితిని. ఆయన మరియాదగనే మాటలాడెను గాని తన కేమియు దెలియదనెను. అపుడు చెంతనున్న అమెరికన్ నీగ్రో యొకడు మా సంభాషణలో గల్పించుకొని, 'మీరు క్రొత్తవారువలె నున్నారు. ఇచట నెవరును స్నేహితులు లేరు కాబోలు. నే నెరిగిన అమెరికా దేశస్థుని దొక చిన్న హోటలున్నది. నా వెంట రండు. ఆతడు మీకు బస యొసగు' ననెను.

నాకు లోపల సంశయము పీడించుచునే యున్నను 'మంచిది. అటులే కాని'మ్మంటిని. జాన్స్టన్ అను కుటుంబికుని బస కాతడు నన్ను వెంట నిడికొని యేగెను. జాన్స్టన్‌తో ఏకాంతముగా మాటలాడెను. ఆతడు నే నా రేయి అచట నుండవచ్చుననియు, భోజనము మాత్రము నాగదిలోనే చేయవలెననియు చెప్పెను.

'చూచితిరా, నా కిచటి పట్టింపులు లేకున్నను, ఈ ఐరోపీయుల ఆచారము ననుసరింపక తీరదు. తమతో సపంక్తి భోజనము మీ కిడినచో వారికి కష్టముగా దోచి, వెడలిపోదురేమో యని సంశయించుచుంటి' నని ఆతడు వచించెను.

'దాని కేమి. ఈ రాత్రికి బస యిచ్చితివి, నా కదియే పదివేలు. కొంచెమో, గొప్పయో ఇచటి పరిస్థితులు, నీయిబ్బందియు నెరుగుదును. నాగదిలోనే భుజింతును, నేటికి మునిగిపోయిన దేమున్నది? రేపు మరియొక బస చూచుకొందు' నంటిని.

ఆతడు చూపిన గదిలో నొంటరిగా నేదో ఆలోచించుచు గూరుచుంటిని. ఆ హోటలులో భుజించువారు పెక్కుమంది లేరు

గాన నౌకరు వెంటనే నాకు భోజనము గొనివచ్చు ననుకొనుచుండగా జాన్సుటనే నాగదిలోనికి వచ్చెను. 'మిమ్ము మీగదిలోనే భుజింపు డనుట నాకు జాల కష్టముగా నుండి తక్కిన అతిథులతో ప్రస్తావించి చూచితిని. ఏక పంక్తిని భుజించుటకు వారి కాక్షేపము లేదు. మీ కిష్టము వచ్చినన్నాళ్ళు ఇచట నుండవచ్చుననిరి. కావున భోజన శాలలోనే భుజింపవచ్చును, రండు. మీ చిత్తము వచ్చినంత కాల మిచట నుండు' డనియెను. ఆతని సుజనత్వమును గొనియాడుచు భోజనశాల కేగి యచట బదిమందితో గడుపార భుజించితిని.

ప్రిటోరియాలో శ్రీ ఎ. డబ్లియు బేకరు మా వ్యవహర్త. మరునా డుదయమున ఆయనను జూడనేగితిని. అబ్దుల్లా సేటు ముందుగనే నాతో వర్ణించి చెప్పినట్లుగనే శ్రీ బేకరు నన్ను ప్రియ మార నాదరించెను. నా యోగక్షేమములు విచారించిన పిమ్మట 'మీ రిచట బారిస్టరుగా వ్యవహరింప బనిలేదు. మేము ముందే సమర్థుడగు లాయరును మాటాడి యుంచితిమి. ఈ వ్యవహారము చిక్కులతో నిండి, చిరకాలముగా సాగుచున్నది. దీనిని గూర్చిన వివరములు నాకు మీరు చెప్పుచున్నచో నది చాలును. నేను ఈ వివరము లన్నియు వాదులవలన తెలిసికొనుటకంటె మీ ద్వారమున తెలిసికొనుచున్నచో నెక్కువ వీలుగా నుండి మా పని సుకరము కాగలదు. ఇక మీకు బస యొకటి చూడవలసి యున్నది. మిమ్ము గలసికొన్న పిమ్మటనే బస చూడవచ్చునని ఇన్నాళ్లు నూరకయుంటిని. ఇచట ప్రబలిన వర్ణద్వేషము మూలమున మీవంటివారికి బస దొర కుట కష్టమే. నే నెరిగిన పేదరాలొకతె యున్నది. ఆమె భర్త రొట్టెల వ్యాపారి. మీకు తమయింట భోజనాది వసతులు కల్పించు

టచే నామెకు గొంత కూడివచ్చునుగాన అంగీకరించు ననుకొంటును. రండు, వారి యింటికి కేగుద ' మనెను.

ఇరువురము నచటికి వెళ్ళితిమి. ఆమెను చాటునకు బిలిచి శ్రీ జేకరు నావిషయమై మాటలాడెను. వారమునకు 35 షిల్లింగులు పుచ్చుకొని నాకు నసతియు, భోజనము నొసగుట కామె సమ్మతించెను.

## 20

## భారతీయుల కష్టనిష్ఠురములు

ట్రాన్సువాలులోను, ఆరంజి ఫ్రీస్టేటులోను నివసించు భారతీయుల ఆర్థిక సాంఘిక రాజకీయ ప్రతిపత్తినిగూర్చి, నేను ప్రిటోరియాలో నుండగా సాకల్యముగా విచారించి తెలిసికొంటిని. తరువాతి కాలమున నా కిది మిక్కిలి యుపకరించునని నే నపు డెరుగను.

అప్పటికి సవరణపొందిన ధర్మశాస్త్రము ట్రాన్సువాలులో ప్రవేశించు భారతీయులకు మూడు పౌనుల తలపన్ను విధించుచుండెను. కొన్ని ప్రదేశములలో దక్క వారు భూమి సంపాదింపగూడదు. ఆ భూమికూడ వారికి సంక్రమించుట అరిది. వారికి వోటుగూడ లేదు. ఇవి యన్నియు ఆసియావాసుల కొరకు నిర్మించిన శాసనములు. రంగుజాతులవారి కొరకు నిర్మించిన శాసనములు ఆసియావాసులకు గూడ వర్తించును.

రంగుజాతుల శాసనములో రాచబాటప్రక్క భారతీయులు నడవగూడదనియు, రాత్రి 9 గంటల పిమ్మట అనుమతి పత్రము

లేకుండ ఇలు వెడలకూడదనియు నిషేధము కలదు. శ్రీ కోట్సు అనే మిత్రముతో నేను తరచు రాత్రులు సికారుకేగి 10 గంటల వేళ వచ్చుచుంటిని. ఆ సమయమున పోలీసులు నన్ను నిర్బంధించిపోవుదు రేమోయను సంశయము నన్నును. నాకంటె అధికముగా శ్రీ కోట్సును బాధించుచుండెడిది. తన నీగ్రో నౌకర్లకిచ్చినట్లు అనుమతి పత్రములు ఆయన నాకీయజాలడుగదా! ఆ పత్రములను యజమానులు నవుకర్లకిచ్చుచుందురు. నా కట్టి పత్రముతో బనికలిగి, దాని నిచ్చుట కాయన కభ్యంతరము లేకుండినను నే నాయనకు నవుకరునుగాను కావున ఆత డట్లొసగుట మోస మనిపించుకొనును.

ఈ బెడద నూన్పుటకై ఆయనయో, ఆయన మిత్రుడో నన్ను సర్కారు వకీలు చెంతకు గొంపోయెను. డాక్టరు క్రాజ్ అను నా వకీలు చెంత కేగుసరికి ఆయనయు, నేనును సతీర్థులమని తేలెను. రాత్రు లిల్లువదలుటకు నాకు అనుమతి పత్రము కావలసి వచ్చెనేయని డాక్టరు క్రాజ్ చాల నొచ్చుకొనెను. నా దురవస్థకు దానును వగచి, రాదారి చీటికి బదులుగా నా కొక చేయుత్తర మొసగెను. అది చెంత నున్నచో ఏ వేళయందేనియు బోలీసులు నన్నాటంకపెట్టలేరు. ఇల్లు కదలి నపుడెల్ల ఆ యుత్తరము నాతోనే యుండెడిది. దానితో నా కెన్నడు అక్కర కలుగకపోవుట అదృష్ట విశేషముచేతనే గాని మరియొకటి కాదు.

కాలిబాటపై చరింపరా దను నిషేధము నా పాలిటికి దారుణముగా పరిణమించెను. ప్రెసిడెంటు వీధిగుండ నావలి మైదానమునకు సికారు పోవుట నా కలవాటు. ప్రెసిడెంటు క్రూగరు భవన

మా వీధిలోనే యున్నది. అచటి తక్కిన యిండ్లవలెనే దానికిని దోటయు, దొడ్డియు మున్నగు నాడంబరములు లేవు.

ఆ గృహ మధికారుల దనుటకు గురుతుగా నొక పోలీసు మాత్రము వాకిట కావలి యుండెడి వాడు. నే ననుదినము కాలి బాట వెంట నా కావలి వానిని దాటి యేగుచుంటిని. నన్నెవరు నడ్డగించినది లేదు.

ఆ కావలివాండ్రు వంతుల చొప్పున మారుచుందురు. ఒక నాడచటి కావలివాడు, తొలగిపొమ్మని హెచ్చరించుట యేని చేయక, ఉన్నట్లుండి నన్ను దన్ని వీధిలోనికి బడ ద్రోచెను. నేను డిల్లవడి చూచుచున్నంతలో ఆ త్రోవ వెంట ఆశ్వముపై నేగుచున్న శ్రీ కోట్సు 'గాంధి' యని నన్ను బలుకరించి, 'నే నంతయు జూచితిని. వీనిపై నీవు కోర్టులో చర్య జరపుదు వేని నేను సాక్ష్యమిత్తును. ఈతడు నీయెడ నెరపిన దౌష్ట్యమునకు జింతించుచున్నా' ననెను.

నేను 'ఇందు మీరు చింతింపవలసినది లేదు. పాప, మాత డేమి యెరుగును. నల్లనివారందరు నాతని కొక్కటియే. నీగ్రోలపై గూడ నీత డిట్లే చేయి జేసికొనుచుండును గాబోలు. స్వవిషయమున గోర్టుకు వెళ్ళగూడదని నియమము చేసికొంటిని. కావున గోర్టులో వీనిపై చర్య జరపను' అంటిని.

అంతట శ్రీ కోట్సు 'నీ వెప్పుడు నింతే. అయినను ఆలో చించి చూడుము. ఇట్టివాండ్ర కొకపరి బుద్ధి గరపుట మంచిది' అనెను. పిమ్మట నా పోలీసువానిని గట్టిగా మందలించెను. ఆతడు బోయరు జాతివాడగుటచే వా రిరువురి డచ్చిభాష నాకు దెలిసినది

కాదు. ఆ పోలీసు నన్ను క్షమాపణ వేడెనుగాని అంతటి పని యక్కరయే లేదు. నేను వాని నంతకుమున్నే క్షమించితిని.

మరల నెన్నడు నేనా వీధిలో నడుగుబెట్టలేదు. ఈ తూరి కావలి యున్నవాని కీ వృత్తాంతము దెలియదుగాన వాడును ఇట్లే చేయి మిగులునేమో. వాని తన్నులకు బాల్పడనేల యని మరియొక దారి చూచికొంటిని.

అభిమాన వంతుడగు భారతీయునకు సౌతాఫ్రికాలో చోటు లేదు. దీని కేమి ప్రతిక్రియ చేయవలెనాయను ఆలోచన నన్ను విడువదాయెను. కాని దాదా అబ్దుల్లాసేటు వ్యవహారమే నా కప్పుడు ప్రస్తుత మాయెను.

## 21

## అబ్దుల్లా దావా

దావాలో పూర్వ సందర్భము లన్నియు శ్రీ అబ్దుల్లాకే అనుకూలముగా నున్నవి. ధర్మశాస్త్రముకూడ మా కనుకూలింపక తీరదు. కాని ఈ వ్యవహారమునందు వాది ప్రతివాదు లిరువురు బంధువులు, ఏకనగర వాసులును. వ్యవహారమును సాగలాగిన చో నిరువురు నష్టముపాలై పోవుదురు. వ్యవహార మెప్పటికి అంత మొందునో తెలియదు. నాకు జూడగా నీ యిద్దరిని సమాధాన పరచి, సఖ్యమొనగూర్చుట యుక్తమని తోచెను. పడగల పాట్లన్నియు బడి సమాధానము సాధించితిని.

ఇరువురు నిందులకు సంతోషించిరి. ఇరువురిని లోకము కొనియాడెను. నా సంతోషమునకును మేరలేదు. తగవు దిద్దుటయే నిజమునకు లాయర్ల ధర్మము. నేను దానిని నిర్వర్తించితిని. ప్రజల మంచితనమును పసిపట్టి హృదయములను గరగించు నేర్పు నా కల బడెను. వివాదల పాలయిన యిరువాగు నేక మొనర్చుటే లాయర్ల విధి యని గ్రహించితిని. ఇది నాకు అస్తిగతమై పోవుటచే నేను లాయరుపని చేసిన ఇరువదేండ్లు వందల కొలది వివాదలను కోర్టు కెక్కకుండ ఓర్మి దిద్దుటతోనే సరిపోయెను. దీనిచే నాకు సొమ్ము నష్టములేదు సరిగదా. ఆత్మనష్ట మసలే లేదు.

## 22

## తానొకటి తలప దైవమొకటి తలచెను

వ్యవహారము ముగియుటచే ప్రిటోరియాలో నాకింక పని లేదు కావున దర్బానుకు దిరిగి పోయి ఇంటికిజను సన్నాహము సల్పుచుంటిని. అబ్దుల్లా సేటు నన్నట్లు ఊరక పోనిచ్చునా? పెద్దపెట్టున సన్నాహము చేసి సిడెన్హాములో వీడ్కోలుపు విందుచేసెను.

ఆనాడచట గన్పించిన-వార్తాపత్రికలు పెరుగవేయుచుంటిని. వానిలో నొకచో 'భారతీయుల వోటుహక్కు' అను పేరనున్న కొన్ని పంక్తులు కంటబడెను. నేటాలు శాసన నిర్మాణ సభలో సభ్యుల నెన్నుకొను అధికారము భారతీయులకు లేకుండ జేయుటకై అపుడు సిద్ధమగుచున్న శాసనమునుగూర్చిన వార్తయది. • అట్టి శాసన

మొకటి పుట్టుచున్న వార్త నేనుగాని ఆ విందున కరుదెంచినవారు గాని మున్ను విన్నదికాదు.

అబ్దుల్లాసేటు ఏనానేమోయని ఆయన నడిగితిని. ఆయన 'నా వ్యాపారపు గొడవలేకాని యిట్టివి మాకు బట్టవు' అనెను. ఈ వార్త నా మనసు నించుక కలచెనుగాని ఒకవంక ప్రయాణమునకు జెప్పులలో గాళ్లు పెట్టుకొనియున్న నా కిది యేలయని సంశయించుచునే శ్రీ అబ్దుల్లాతో 'ఇది శాసనమైనచో నిచట మన యునికి చాల ఇరుకున బడును. ఇది మన యభిమానమునకే గొడ్డలిపెట్టు' అంటిని.

అచటి యతిథు లెల్లరు మా సంభాషణ నాస్థమై వినుచుండిరి. అందొకరు దీని కొక్కటియే మందు. మీ రొక నెలదినములు ప్రయాణము గట్టిపెట్టి మాకు దారి చూపితిరా, మేము దీని యంతు తేల్చికొందుము' అనిరి. తక్కినవారందరు 'మేలు మే' లని ఆ మాటను సమర్థించిరి.

ఇక నే మున్నది? నా ప్రయాణము సాగుట వట్టిదియాయెను. అచటి భారతీయ మిత్రులు నన్ను జుట్టుముట్టి 'మీ రిచటనే ఉండి పొండు' అనుచు అనురోధము సల్పిరి. నే నంతట నేటాలువాసినై పోతిని. ఊపిరి సలుపకుండ ఆందోళన సాగింపనిచో సీమలో నున్న వలసమంత్రికి చీమ కుట్టదు. ఈ కార్యసాధనకై సుస్థిరమైన సంఘ మొకటి యుండుట మంచిదని తోచెను. శ్రీ అబ్దుల్లా మున్నగు స్నేహితులతో సంప్రదింపగా వారు సమ్మతి జూపిరి. అంతట మే నెల 22 వ దినమున 'నేటాలు ఇండియన్ కాంగ్రెసు' అను ప్రజా సంస్థను నెలకొల్పితిమి.

## మూడు పౌనుల పన్ను

నేటాలువాసులగు ఐరోపీయులచట చెరకుపంట కానుకూల్య మున్నదని గ్రహించిరి. అందులకు కూలివాండ్రు కావలసి వచ్చిరి. చెరకు పండించుట కేమి, చక్కెర చేయుట కేమి నేటాలులోని జూలు కూలివాండ్రు పనికిరారు. కావున నేటాలు ప్రభుత్వము భారత ప్రభుత్వముతో సంప్రదించెను. మన దేశపు కూలివాండ్రను నేటాలుకు దీసికొనిపోవుటకై భారత ప్రభుత్వ మనుమతించెను. నేటాలుకేగిన మన కూలివాండ్రచట నైదేండ్లు పనిచేసితీరవలెను. ఆ పిమ్మట నచట భూమి పుట్రలు సంపాదించుకొని, ప్రాత కాపులు గావచ్చునని ఆసలు చూపి మన ప్రజ నటకు గొనిపోయిరి.

ఆవిధముగా నిటకు వచ్చిన భారతీయులు తమకు జెప్పిన పని చేసి యూరకొనక అధికముగా బరిశ్రమించిరి. స్వదేశమునుండి క్రొత్త విత్తనములు దెచ్చి కూరగాయలను కొల్లలుగా బండింప సాగిరి. ఇచటి విత్తనములను గూడ చవుకగా బండింప జొచ్చిరి. మామిడియంట్లు దెచ్చి నేటాలులో నాటిరి. కర్షకవృత్తితో నాగక కొందరు వర్తకము చేయనారంభించి, భూములగొని యిండ్లు కట్టి కొనిరి. కూలికి నాలి కేగుట మాని క్షేత్రస్వాములు, గృహస్వాములు నైరి. భారతదేశమునుండి కొందరు వణిజులు గూడ నిచటి కేతెంచిరి.

కూలికై కొనితెచ్చిన భారతీయులిట్లు క్షేత్రస్వాములు, వర్తకులు నగుట గన్గొన్న తెల్లవర్తకులకు గన్నుకుట్టు వొడగెను. బేరసారములలో భారతీయుల నైపుణ్యమును గాంచి వారు కళవళపడిరి.

సొంత సేద్య మొనర్చుకొన్నచో సహింప నగునుగాని సొంతవ్యాపార మును గూడ భారతీయులు సాగించినచో సహించు టెట్లు?

భారతీయులయెడ నీ విధముగా నాటుకొన్న ద్వేషబీజములకు మరికొన్ని సందర్భములు తోడై దోహదము సలిపెను. అంతట, వ్యవసాయపు గట్టుబడికై వచ్చిన భారతీయులందరికి తలపన్ను విధించు శాసనరూపమున ఈ ద్వేషబీజములు ఫలించెను.

మే మీతలపన్నుపై కత్తిగట్టి ప్రతిఘటించితిమి. ప్రజ లీ పోరాటమున వెనుకంజ యిడి చాలించినను, కాంగ్రెసు సంఘము ఈ పన్ను మనకింక వదలదని దానికి తలయొగ్గినను — కట్టుబడికూలీల కీ తలపన్ను పీడ నేటికిని అట్లేయుండి, దక్షిణాఫ్రికా భారతీయుల కే కాదు. యావద్భారతభూమికి దలవంపు గూర్చుచుండెడిది.

దక్షిణాఫ్రికాలో నా కప్పటికి మూడేండ్లు గడచినవి. అచటి ప్రజలు, నేను నొకళ్ళ కొకరు ప్రాబడి బంధువులమైతిమి. ఆ దేశ మున ప్రాతకాపునై పాదుకొంటినని స్పష్టపడిపోయినది. అచటి నా వకీలువృత్తి కొంత మెరుగుగానే యుండెను. నా యునికి అచటి వారికి తీరని యక్కరయైపోయెను కావున 1896 లో ఆరుమాసముల పాటు స్వదేశమున కేగివచ్చుటకు వారి యనుమతి గొంటిని. నా యాలుబిడ్డలతో దిరిగివచ్చి యచటనే యుండిపోవుట మంచిదను కొంటిని. భారతభూమి కేగినచో మరియొక మేలును చేకూరును. దక్షిణాఫ్రికా భారతీయుల కష్టనష్టములను భారతీయులకు వివరించి చెప్పి వారి సానుభూతిని, సహకారమును సంపాదింపవచ్చును.

## పంచమ భాగము : స్వదేశాగమనము

### 24
### ఇండియాలో

నేను బొంబాయిలో ఆలసింపక హుటాహుటిగ రాజకోట చేరితిని. దక్షిణాఫ్రికాలోని స్థితిగతులను వివరించు చిన్న పొత్తమును రచింప బూనుకొంటిని. గ్రంథరచనకు, దాని ప్రచురణకు ఒక్క నెల పట్టెను. పైనున్న ఆకుపచ్చని కాగితముచే దానికి ఆకుపచ్చ పొత్తమని పేరువచ్చెను. అందు దక్షిణాఫ్రికా భారతీయుల దురవస్థను ప్రయత్నపూర్వకముగ, తగ్గించి చిత్రించితిని. పదివేల ప్రతులచ్చొత్తి దేశములోని వార్తాపత్రికలకు, పెద్దలకు నందజేసితిని. ఆ గ్రంథసారమును 'రాయిటరు' సీమకు బంపెను. దాని నింకను వడియగట్టి లండను నుండి నేటాలు కంపిరి. మూడు పంక్తులకు మించని ఆ సార సంగ్రహములో నేను రచించిన మాటలు లేకపోగా, నేను చిత్రించిన నేటాలు భారతీయ దురవస్థ అందు పెక్కుమడుగులుగా జిత్రితమాయెను. దానిచే నేటాలులో నెట్టి ఫలితము గలిగెనో ముందుముందు తెలియనగును. ఈలోపల పలుకుబడి గల వార్తాపత్రిక లన్నియు నా గ్రంథముపై దీర్ఘవ్యాఖ్యలు ప్రచురించెను.

ఈ పదివేలప్రతులను దేశమున బలుతావులందున్న పెక్కుమందికి బంపుట సుకరముగాదు. వీనిని పోస్టులో వేయుటకు మరల

సంచులుగట్టి, పోస్టుబిళ్ళ లంటించవలెను. చిరునామాలు వ్రాయవలెను. ఇది యంతయు ధనసాధ్య మని చింతించి, నే నొక యుపాయము చేసితిని. విద్యార్థుల గొందరిని ప్రోగుచేసి వారికి బడిలేని వేళలందు, దినమునకు రెండుమూడు గంటల చొప్పున వారిచే సీ పని యంతయు జేయించితిని. వాడిన పోస్టు బిళ్ళలు నాకడ నున్నవి వారి కిచ్చెద నంటిని. వారిని దీవింతు నంటిని. ఆ బాలురు సంతోషపూర్వకముగ ఆ పని యంతయు నింతలో చేసిపెట్టిరి. మంచి మాటలతో నేను బాలురచే పనిగొనుటకదియే మొదలు. ఆ విద్యార్థులలో నిరువురు నేడును నాతో గలిసి పనిచేయుచుండిరి.

దక్షిణాఫ్రికాను గూర్చి పట్టనములలో సభలు సమకూర్చి వివరించుట యుక్తమని యెంచి తొలుత బొంబాయిలోను, పిమ్మట పూనాలోను ఉపన్యసించి, పదపడి మదరాసుకు, అటనుండి కలకత్తాకు నేగితిని. ఆ నగరమం దుండగనే దర్బానునుండి 'జనవరిలో పార్లమెంటు ఆరంభ మగును. వెంటనే బయలుదేరుము' అని కేబుల్ (నిస్తంత్రీవార్త) వచ్చెను.

కావున డిసెంబరు మాసారంభమున మరల దక్షిణాఫ్రికాకు బయలుదేరితిని, నా భార్యను ఇరువురు కొమరులను, పితృహీనుడగు నా మేనల్లుని వెంట గొంపోతిని. మా యోడతోపాటు 'నదేరి' యను మరియొక నావ దర్బానుకు బయలుదేరినది. దాదా అబ్దుల్లా కంపెనియే ఆ రెండునావలకు ఏజెంట్లు. రెంటిలోను మొత్త మెనిమిది నందలమంది బయలుదేరిరి. వారిలో సగపాలు ట్రాన్సువాలు చేరవలసినవారే.

# షష్ఠ భాగము : మరల దక్షిణాఫ్రికా

## 25

## తుపాను

18 వ డిసెంబరున మా యోడలు దర్బాను రేవులో లంగరు వైచెను. వైద్యులు వచ్చి పరీక్షింపకుండ దక్షిణాఫ్రికా రేవులలో ప్రయాణికు లెవరును దిగరాదనిరి. ఓడలో అంటుజబ్బు నా రేవ కేని యున్నచో ఆ యోడను గొన్నాళ్ళు విడిగా నుంచవలసి యుండును. మేము బయలుదేరునపుడు బొంబాయిలో ప్లేగురోగ ముండెనుగాన మా యోడ కేకాంతవాసము తప్పదనుకొంటిమి. వైద్యుడు వచ్చి పరీక్షించి మాకు ఐదునాళ్ళేకాంతవాసము విధించెను. ప్లేగురోగము 23 నాళ్ళకుగాని బయటబడదు. మేము బయలుదేరి 18 నాళ్ళయినది. కావున మరియైదు దినము లేకాంతముగా నున్నచో ననుమానము తీరిపోవును. మమ్మట్లు విడిగా నుంచుటకు కారణ మొక్క ప్లేగు భయమే కాదు; దీనికి వేర కథయున్నది.

దర్బానులోని తెల్లవాండ్రు మమ్ము వెనుకకు ద్రిప్పిపంపవలసిన దని ప్రభుత్వమునకు ఒత్తిడి కల్పించుచుండిరి. మమ్ము ఓడ దిగనీయమి కిదియొక కారణము. దాదా అబ్దుల్లా కంపెనీ నుండి నగరములోని వార్తలు మా కేనాటి వానాడు అందుచునే యుండెను. తెల్ల

వాం డ్రనుదినము నీ విషయమున సభలోనర్చి అలజడి కల్పించు చుండిరి. నిర్భాగ్యులగు భారతీయులు, వారియందను కొలదిమంది ఆంగ్లేయులు నీవంక; ఇక నావంక నున్న తెల్లవాండ్రన్నన్నో, మంది, మార్బలము, ఆయుధములు, ఐశ్వర్యములతో దుర్నిరీక్షులు. వారికి సర్కారు పెద్ద యండయై చాటుమాటులు లేక నిలిచినది.

ఓడలలో నున్న ప్రయాణీకు లేవో ఆటపాటలతో గాలక్షేప మొనర్చుచుండిరి. నేనును వారితో వినోదించుచుంటినే కాని నా మన సంతయు దర్బానులో రేగిన పోరాటముపై నుండెను. శత్రువులకు నేనే లక్ష్యముగావున నాపై రెండు బాణములు సంధించిరి.

1. నేను భారతభూమియం దున్నపుడు నేటాలు తెల్లవారిపై లేనిపోని నిందలు మోపితిని.

2. నేటాలును భారతీయులతో ముంచివేయుటకై రెండు నావలనిండ జనమును గొని తెచ్చితిని—అని

నిజమునకు నే నేపాప మెరుగను. నే నెవరిని నేటాలుకు రండని పిలుచుకొని రాలేదు. ఓడలో నెక్కిన ప్రయాణీకులు నా కపరిచితులు. ఒక రిద్దరు బంధువులవి తప్ప ఓడలో నెక్కిన వంద లాది ప్రయాణీకులలో ఒక్కరి యూరును పేరునుగూడ నే నెరుగను. ఇండియాలో నున్నపుడు నేటాలు తెల్లవాండ్రనుగూర్చి నేను క్రొత్తగా ఆడిపోసికొన్నదియు లేదు. అంతకు మున్ను నేటాలులో జెప్పిన మాటలనే తిరిగి ఇండియాలో జెప్పితిని. అవియేనియు నేను నిరా ధారముగ జెప్పిన మాటలు కావు.

ఒకొక్కటి దినమే దీర్ఘదీర్ఘమై గడచిపోవుచుండెను.

ఇట్లు ఇరువదిమూడవ దినము లేగినపిమ్మట ఓడలను రేవు లోనికి రానిచ్చి, ప్రయాణీకులు దిగుట కనుమతించిరి.

నా తోడి ప్రయాణీకు లొకరొక్కరే దిగి యేగుచుండిరి. ఇంతలో ఓడ కప్తానుకు నేటాలు మంత్రిమండల మందలి శ్రీ యెస్కాంబ్ నుండి వార్త వచ్చెను. 'ఇచటి తెల్లవారు గాంధిపై మండిపడు చున్నారుగాన ఆయన ప్రాణముల కపాయము గల్గును. చీకటి పడినపిమ్మట ఆయన సకుటుంబముగా దిగినచో, రేవుసూపరింటెం డెంటు శ్రీ టాటమ్ వారిని తనవెంటగొని పోయి ఇంటికి జేర్చును.' కప్తాను నాకీ వార్త నందింపగా నే నట్లే కానిండంటిని. మరి అరగంటలోపల, దర్బాను భారతీయులకు మిత్రము, వకీలునగు శ్రీ లాటన్ కప్తానుకడ కేతెంచి, 'గాంధి సమ్మతించినచో ఆయనను నావెంట గొంపోదును. దాదా అబ్దుల్లా కంపెనీకి వకీలునగు నా మాటపై మీరు శ్రీ ఎస్కాంబ్ పంపిన వార్త నుల్లంఘింప వచ్చును' అని చెప్పెను. పిమ్మట నా చెంత కేతెంచి 'మీరు సాహసించి నావెంట రండు. మీ కుటుంబమును బండిలో రుస్తుంజీ ఇంటికంపి మన మిరువురము నడచిపోవుదము. రాత్రివేళ దొంగవలె మీరు నగరము సొచ్చుట నాకు నచ్చలేదు. మీకు నేమియు నపాయము రాదు. తెల్లవారందరు చెదరిపోయిరి. నగరమంతట సద్దు మణగినది. ఏది ఎట్లయినను మీరు దొంగవలె నగరప్రవేశ మొనర్చుట మాత్రము తగదు'—ఇది నాతో జెప్పిన మాటల సారము. నేను వెంటనే సమ్మతించితిని. నా భార్యయు, బిడ్డలును నిరపాయముగా రుస్తుంజీ ఇల్లు చేరిరి. కప్తాను అనుమతిగొని నేను

(శ్రీ) లాటన్‌తో బయలు దేరితిని. రుస్తుంజీ గృహ మచటికి రెండు మైళ్ళదవ్వు.

నేను ఓడ దిగి యొడ్డు చేరగనే కొందరు బాలురు నన్ను గురుతించి, 'గాంధి గాంధి' యని కేకలిడినంత నైదారుగురు పెద్ద వాండ్రు పరుగున నే తెంచి తామును కేకలిడ సాగిరి. గుంపు క్రమముగా పెద్ద దగునని భయపడి (శ్రీ) లాటన్ రిక్షావాని బిలిచెను. రిక్షాపై నెక్కుట కెన్నడు నా కిష్టము లేదు. తొలిసారిగా రిక్షా ఎక్కవలసి వచ్చెను. కాని ఆ బాలురు నన్ను దానిపై నెక్కనీయక రిక్షావాని బెదరించినంతట వాడు పారిపోయెను. మేమట్లే నడచి యేగుచుండ గుంపు పెద్దదై మాకు ముందున కడుగిడుట కష్టమై పోయినది. ఆ మూక ముందుగా (శ్రీ) లాటనును ముట్టడించి మ మ్మిరువుర వేరుచేసెను. పిమ్మట రాళ్ళను, ఇటుకముక్కలను, కుళ్లిన గ్రుడ్లను నాపై ప్రయోగించెను.

అందొకడు నా తలపాగ లాగివైచెను. కొందరు నన్ను గాళ్ళతో దన్ని, చేతులతో మోదుచుండిరి. నాకు స్మృతి తప్పిపోవు చుండ చేరువనున్న యింటి పెండెపు చువ్వ లాలంబముగా నిల్ద్రొక్కి కొని ఊపిరికై పెనలాగుచుంటిని. అంతటనేని ఆ మూక విడువక నన్ను గ్రుద్దుచు, బాదుచు బాధించుచుండ నాకు నిలుచుట అశక్య మాయెను. పోలీసు సూపరింటెండెంటు భార్య నన్నెరుగును. ఆమె యా దారి నేగుచు, సాహసించి నన్ను దరియ నేతెంచి, అపుడెండ లేకున్నను తన గొడుగును విప్పి, మూకకు నాకు నడుమ నిలిచెను. ఆమె (శ్రీ)మతి అలెగ్జాండరు. ఆమెకు దగులకుండ నన్ను గొట్టుటకు వీలుగామి నా మూకకు గాక యించుక వెనుకాడెను.

ఇది యంతయు గాంచిన కుఱ్ఱ భారతీయుఁ డొకఁడు పోలీసు స్టేషనుకు బరుగిడి చెప్పినంతట, నన్ను పొదివికొని ఇంటికి జేర్చుటకై సూపరింటెండెంటు కొందరిని సాయమంపెను. వారు సమయమున కేతెంచిరి. పోలీసు స్టేషను మే మేగు త్రోవయందే యున్నది. నే నచటికి జేరగానే సూపరింటెండెంటు నన్ను స్టేషనులో దలదాచు కొమ్మని చెప్పెను. నే నందుల కీయకొనక 'వీరు తమ తప్పు దా మెఱిగినంతనే శాంతి చెందుదురు. వీరు తప్పొప్పు లెఱుగని వార లని నాకు నమ్మకమున్న' దంటిని. పోలీసుల సాయముతో నిట్లు మరి యేబాధకు గురిగాక రుస్తుంజీ గృహమును జేరుకొంటిని. ఒడ లెల్ల చీరుకొనిపోయినదే గాని ఒక్కచో దక్క- పుండ్లేమియు బడ లేదు. అచటనే యున్న మా యోడ వైద్యుడు శ్రీ దాదిబర్జార్ నాకు వలసిన చికిత్స గావించెను.

ఇంతలో నిమ్మకు నీరెత్తి నట్లున్నను ఇంటి వెలుపల దెల్ల వాండ్రు చుట్టు ముట్టియుండిరి. మస మసక చీకట్లతో రాత్రి యగు చుండెను. 'ఏదీ గాంధి! గాంధిని బయటికంపు' డనుచు నింటిచుట్టు మూగిన మూకలు కేకలిడుచుండెను. అది నెఱిగి పోలీసు సూప రింటెండెంటు అచటికి కేతెంచి, మూకలను బెదరింపక, చల్లని మాటలు చెప్పి అదుపులో నుంచుచుండెను. కాని ఎటుపోయి యెటువచ్చునో యని ఉక్కగా నుంటచే నా కిట్లు కబురంపెను: 'మీ స్నేహితుని యింటికి, ఆస్తికి, మీ కుటుంబమునకు అపాయము దప్పింప నెంతు రేని, నా యాలోచన విని, మారు వేసమున ఇలు దాటిపొండు.'

ఆయన కాలుమోపగనే నేను భారతీయ పోలీసు దుస్తులను, సానాన్నేష్టనమును దాల్చితిని. ఇద్దరు గూఢచారులు నా వెంటనుండిరి. అందొకరు భారతీయ స్త్రీ వేషమును దాల్చె. మొగమున రంగు బూసికొనిరి. నేడక నీతని కూడ వేస మెట్టిపో మరచితిని. సందు దారిని బడి, పోవుచున్న దుకాణముదాటి. అచటి గిడ్డంగిలోని గోనెసంచుల మధ్యగా వాకిటి కేతెంచి, జనసమూహమున బడితిమి. వీధి చివర నాకొరకు నిలిపియుంచిన బండినెక్కి. అంతకుము న్నచట తలదాచుకొన నిరాకరించితినో. ఆ పోలీసుస్టేషను కేగితిమి. ఆ రహస్యచారులతో, సూపరింటెండెంటుతో 'మీ పుణ్యమా యని బ్రదికితి' నంటిని.

మే మట్లు తప్పించుకొని యేగుచుండ శ్రీ అలెగ్జాండరు
'గాంధితాతను పట్టండి
చెట్టున వ్రేల గట్టండి'
అని పాడుచు అల్లరిమూకను వినోదింప జేయుచుండెను.

పోలీసుస్టేషనుకు నేను సుఖముగా జేరిన వార్త యందగనే సూపరింటెండెంటు ఆ దుండగులకు 'ప్రక్క దుకాణముగుండ పిట్ట తప్పించుకొని పోయినది. మీ రిక తండ్లకు బొందు' అని తెలియ జెప్పెను. ఈ వార్తవిని వారిలో గొందరు కినుక జెందిరి, కొందరు నవ్వికొనిరి, కొందరు నమ్మలేకపోయిరి.

శ్రీ అలెగ్జాండ రప్పుడు 'మీకు నమ్మకము లేనిచో మీలో ఒకరిద్దరు నాతో లోనికివచ్చి వెదకికొనుడు. గాంధి దొరకినచో, నే నడ్డము చెప్పక మీ కప్పగింతును. దొరకనిచో ఎవరి యిండ్లకు

వారేగవలెను. గాంధియూలు బిడ్డల జోలికి మీరు పోరు, పస్తుంజీ ఇంటికిని ద్రోహము దలపెట్టరు; నేనెరుగుదు' ననెను.

అంతట నా దుండగుల ప్రతినిధు లిల్లంతయు గాలించి చూచిరి. ఫలముగానక, వెలికేతెంచి, ఆవార్త చెప్పినంతట సూపరింటెండెంటు నిపుణతను, ఉపాయమును మెచ్చుకొనువారు గొందరు, పొగలు సెగలు గ్రక్కువారు గొందరునై ఎవరిదారిని వారేగిరి.

కీర్తిశేషుడగు శ్రీ చాంబర్లయిను అప్పటి వలసప్రగ్గడ. ఆయన గాంధిపై చేయి జేసికొన్నవారిని విచారించి దండింపవలసిన దని నేటాలు సర్కారు నాదేశించెను. శ్రీ ఎస్కాంబ్ నన్నపుడు పిలిపించి నాకు గాయము లైనందులకు వగచుచు మీ కణుమాత్రము బాధగలుగుటయు నేను సహింపను. నాకది సంతోషము గూర్పదు. నామాట నమ్ముడు. శ్రీ లాటను మాట చొప్పున మీరు తెగువ చేయుటను నేను కాదననుగాని, నామాట వినియున్నచో ఈ విషాద సంఘటన తప్పిపోయెడిది. మీపై చేయిజేసికొన్న దుండగులను మీ రిపుడేని గురుతించుచో వారిని బంధించి కోర్టులో విచారణకు నిలుపుదును. శ్రీ చాంబర్లయిను మంత్రి అభిలాషముకూడ నిట్టిదే' యని చెప్పెను.

నే నిట్లు బదులు పలికితిని: 'ఎవరిమీదను నిందారోపణ చేయుట నా కభిమతముగాదు. ఒక రిద్దరిని నేను గురుతింపగలిగినను వారిని దండించి ప్రయోజన మేమి? ఇంతకు, నిందు వారి దోషమేమి యున్నది? నేటాలులోని తెల్లజాతివారిని గూర్చి నేను ఇండియాలో లేనిపోని అతిశయోక్తులు చెప్పితినని వారి నితరులు నమ్మించిరి. ఆ

నమ్మకముచే వారు క్రోధపరవశులగుట వింతకాదు. తప్పంతయు నిచటి నాయకులది — మీకు — గోసమువలదు — మీ యొంట్లనే. ప్రజలను సరిదిద్ద నేర్చిన మీరుగూడ రాయిటరుపంపిన వార్త విని, నేను గోరంతలు కొండంతలు చేసితినని నమ్మితిరి. కోర్టు విచారణ కెవరిని నేను పాల్పరచ నొల్లను. నిలుకడపై నిజము తెలిసినపుడు వారికే పరితాపము గల్గును.'

అంతట శ్రీ ఎస్కాంబు 'మీ కాక్షేపము లేనిచో ఈమాట వ్రాసియిండు. నేను శ్రీ చాంబర్లెయినకు కవి కేబుల్ ద్వారమున దెలుప వలసియున్నది. ఇప్పుడే తొందరపడి వ్రాయకుడు. శ్రీ లాటన్‌తో ఇతర మిత్రులతో సంప్రదించినపిమ్మట నే వ్రాయవచ్చును. దోషులపై కోర్టు చర్యను మీరు జరుపకుండుట కే నిశ్చయింతురేని, — ఉన్న మాట చెప్పుచున్నాను, — ఇచట శాంతి నెలకొల్పు పని నాకు సుకర మగుటే కాదు; మీ కది ప్రతిష్ఠాకరము గూడ నగును.' అనెను.

నేను 'సంతోషము. నే నెవరిని సంప్రదింప బనిలేదు. మీ కడకు రాకమున్నే అట్లు నిశ్చయించుకొంటిని. నన్ను గొట్టినవారిపై కోర్టుచర్య జరపదగదనియే నా దృఢాశయము. నే నామాటలిపుడే వ్రాసి యిత్తు' నంటిని.

వెంటనే అట్లు లిఖించి యిచ్చితిని.

ఓడ దిగిననాడు 'నేటాలు అడ్వర్టయిజరు' పత్రికా ప్రతినిధి నాచెంతకేతెంచి కొన్ని ప్రశ్నము లడిగెను. నే నన్నిటికి సదుత్తరములిచ్చి, నాపై మోపిన నిందల కాధారము లేదని స్పష్ట మొనర్చితిని. •

ఆ ప్రశ్నోత్తరముల వలనను, నన్ను బాధించిన వారిపై చర్య జరుప నిరాకరించుట వలనను నా సూచిత వినయము దర్బానులోని తెల్ల జాతివారి హృదయములకు వచ్చెను. తా మొనర్చిన పనికి దలలు వంచికొనిరి. పత్రికలు నేను నిరపరాధనని పొగడి, అల్లరి మూకల దుశ్చర్యను తెగడెను. నేను పొందిన శరీరక్షోభ మిట్లు నాకు, అనగా నా యుద్యమమునకు శుభముగా పరిణమించెను. దక్షిణాఫ్రికా భారతీయుల ప్రతిష్ఠ దీనిచే హెచ్చి, నా పూనిన పని సుకరమాయెను. పిమ్మట మూఁడునాలుగు దినములకు నా యింటిలో ప్రవేశించితిని. ఈ యలజడి యంతయు గొన్నాళ్ళకు జల్లారెను.

## 26

## పొదుపరి జీవనము

మాకు చాకలి ఖర్చు అధికమయ్యెను. ఆచాకలి అనుకొన్న సమయమునకు రాఁడు. కావున చొక్కాలు, కాలర్లు రెండుమూఁడు డజను లున్నను చాలవాయెను. దిన దినము కాలరును, దినము విడిచి దినము చొక్కాయు మార్చక తప్పదు. ఇందు వలన నగు రెట్టింపు వ్యయము అక్కరమాలినదని నాకు దోఁచెను. అంతట బట్టలు బాగుచేయు పనిముట్లుకొని, తద్బోధక మగు గ్రంథమును జదివితిని. ఆ విద్యను నా భార్యకు గూడ నేర్పితిని. దీనిచే నాకు బని యధికమైనను అందలి క్రొత్త యొక వింత సంతోషము గూర్చుచుండెను.

స్వయముగా నుదికికొన్న మొదటి కాలరు కథ నాకు మరపురాదు. దానికి గంజి యెక్కువగా బెట్టితిని. ఇస్త్రీపెట్టెకు వేఁడి

చాలలేదు. కాలరు కాలిపోవునోయని పెట్టెతో జక్కగా నొక్కనైతిని. కాని, కాలరుకు బిరుసుదనము తగుమాత్ర మెక్కినది కాని అదనపు గంజి పొడి పొడిగా రాల సాగెను. దానిని ధరించి కోర్టు కేగినంతట తోడి బారిస్టరులకు నవ్వు నందించెను. కాని, ఒరులు నవ్విపోదురను చలి నా కప్పటికే వదలిపోయెను.

వారి పరిహాసమునకు నేను సొంతముగా కాలరు నుతికి కొనుట నా కిదే మొదలు గావున గంజి యెక్కువై రాలుచున్నది. అంతమాత్రమున పోయినది లేకపోగా, మీ కందరకు వినోదము గూర్పగలిగితిని కదా ’ యని బదులాడితిని.

వారిలో నొక మిత్రము ‘ చాకళ్ళకిచట కరవు వచ్చెనా? ’ యనెను. నేను ‘ చాకలి కయ్యెడి ఖర్చు నా తలకు మించిపోయినది. కాలరు మూల్యమునకు దాని యుతుకుడుకూలి సరితూగుచున్నది. అది యటులుండ జాకలివాని దయకు జేతులొగ్గుటకంటె సొంత చాకిరమే మేలుగా దోచిన ’ దంటిని.

చాకలి చెర వదల్చుకొన్నట్టె మంగలి చెరనుండికూడ నేను విడివడితిని. సీమకు వెళ్ళివచ్చిన వారందరకు ముఖ క్షౌర మలవాటగునుగాని తలవెంట్రుకలు కత్తిరించుకొనుట యలవడినట్లు నేను వినలేదు. నే నదికూడ నేర్వవలసి వచ్చెను. నే నొకపరి ప్రిటోరియాలో మంగలి దుకాణమున కేగగా నాతడు నన్ను చిన్నచూపు చూచి కేశఖండన మొనర్ప నిరాకరించెను. నా మనస్సు చివుక్కుమనెను. అంతట నొక కత్తెర కొని తెచ్చి, అద్దముముందు నిలిచి కత్తిరింపు నారంభించితిని. ముందల కత్తిరింపు కొంత మెరుగేకాని వెనుకదెస బొత్తుగా జెడిపోయెను. ఆ కత్తిరింపు సొబగుగాంచి

కోర్టులో స్నేహితులు కనుపుబ్బ నవ్వుకొని 'గాంధీ! అదియేమి, నీ తల యటులున్నది? ఎలుకలు కొరుకలేదుకదా?' యనిరి.

'లేదు. తెల్లమంగలి నా నల్లతల ముట్టననెను. కావున బాగుగనో, ఓగుగనో నేనే కత్తిరించుకొంటి' నంటిని.

ఆ మాట వారి కాశ్చర్యము గూర్పలేదు.

నాకు క్షౌరమొనర్ప నిరాకరించుటలో మంగలి చేసినదోసము గూడ నాకు గన్పించలేదు. నల్లవాండ్రకు వపన మొనర్చినచో వాని కూడు పడిపోవును. మన మంగళ్ళు అస్పృశ్య సోదరులకు క్షౌర మొనర్ప మనము నామాత్రము సమ్మతింతుమా? దీని ఫలమే దక్షిణాఫ్రికాలో పలుమారు లనుభవించితిని. పాప ఫల మనుభవింపక తీర దనుకొని కోపము వారికి దప్పితిని.

## 27

## స్మరణము—ప్రాయశ్చిత్తము

నేను దర్బానులో లాయరుగా నున్నపుడు నా గుమాస్తాలు గూడ తరచు మాయింటనే వసించుచుండిరి. వారిలో గుజరాతి హిందువులును, తమిళ క్రైస్తవులును గలరు. వారిని బంధువులుగా నెంచుకొంటినే కాని మఱొక విధముగా జూచినట్లు గురుతులేదు. ఆ గుమాస్తాలలో అస్పృశ్య కులజుడగు నొక క్రైస్తవుడు గూడనుండెను.

మేమున్న ఇల్లు బంగాళా పంపిణీ దగుటచే గదులనుండి మురుగునీరు వెలికేగుటకు దూములులేవు. అన్ని గదులలోను

మూత్రోత్సర్జనమునకు పాత్రలుండెడివి. ఆ పాత్రలు బాగుచేయుపని పరిచారకులకు బెట్టక నేనో, నా భార్యయో చూచుకొను చుంటిమి. ఇంటిలోని వారుగా మెలగుచున్న గుమాస్తాలు తమ పాత్రలు తామే బాగుచేసికొనుచుండిరి. ఒక క్రిస్టియను గుమాస్తాకు క్రొత్తయగుటచే అతని గదిలోని పాత్రను నేనే బాగుచేయ వలసి వచ్చెను. తక్కినవారి మూత్ర పాత్రలను బాగుచేయుచుండిన నా యిల్లాలికి అస్పృశ్యుని పాత్ర బాగుచేయుట రోత యనిపించెను. అది మా యాలుమగల మధ్య పోట్లాటకు కారణమైనది. నేనే ఆ పాత్ర శుద్ధిచేయుచున్న అందులకు కాని మనసొప్పదు. తాను చేయుటకు నొప్పుకొనదు. కోపముచే నెఱ్ఱవారిన నేత్రములతో, చెక్కిళ్ళ దిగజారు కన్నీటితో నన్నాడిపోసికొనుచు విధిలేక యా పాత్రను చేబూని మేడమెట్లు దిగుచుండిన యామె రూపము నేటికి నా కనుల వ్రేలుచున్నది. మరి నేను కఠోరదయాళువు నగు భర్తను కావున ఆమెకు గురుత్వమును నామీద వేసికొని, ఆమె యందలి ప్రీతియే నన్నంధుని గావింప ఆ యిల్లాలిని కడగండ్ల పాలొనర్చితిని.

మూత్రపాత్ర నామె యెట్లో కైకొని పోవుటతో తృప్తి జనింపక ఆపనిని సంతోషముతో చేయవలెనని పట్టుపట్టి 'నా యింట ఈ వెఱ్ఱి వేషములు సాగనీయ' నని బిగ్గరగా అరచితిని.

ఆమె హృదయమున ఈ మాట లమ్ములై నాటెను.

ఆమెయు 'మీ యింటిని మీరే దాచుకొనుడు. నే పోవు చుంటిని' అని అరచి నంతట, నేను కోపవివశుడనైతిని. నాలోని దయాంకురము ఇంకిపోయెను. నిస్సహాయయగు నామె చేయి పట్టి కొని, మేడ మెట్ల కెదురుగా నున్న వీధి గుమ్మము చెంతకు జరచర

లాగికొని పోయి, తలుపు దెరచి, బయటికి గెంట నుంకించితిని. బాలు బాట నోడియు కన్నీరై పార నామె 'మీకు సిగ్గేలలేదు? ఇంత ఒడలెరుగని సివమా? నే నెచటకు బోవుదును? నా కిచట తలి దండ్రులా, బంధువులా? నన్నెవ రాదరింతురు? మీ భార్యనై నందుకు మీచే దాపులు దన్నులు దినవలెను గాబోలు? మీ పుణ్య మాయె: నిప్పటికేని ఒడలెరిగి ఆ తలుపులు మూయుడు. ఇరుగు పొరుగి కీచులాట చూచి నవ్వి పోదురు' అనుచు హెచ్చరించెను.

సిగ్గున క్రుగ్గిపోవుచు నేను లేని గాంభీర్యము దెచ్చుకొని తలుపులు మూసితిని. ఆమె నన్ను విడనాడ లేనిచో నేను మాత్ర మా యిల్లాలిని వీడగలనా? మేమిట్లు పలుమారు జగడ మాడుకొనియు దుదకు శాంతించుచుంటిమి. సాటిలేని తాలిమి పెంపున ఇల్లాలే నాకెప్పుడును గురుత్వము నెరపుచుండెను.

## 28

## బోయరు యుద్ధము

1897, 1899 సంవత్సరముల మధ్యకాలమునందలి ఇతరానుభవములను విడిచిపెట్టి బోయరు యుద్ధమును గూర్చి యెత్తికొందును.

యుద్ధము పొసగినంతనే నా మనస్సెట్లు ఉరియాడెనో 'దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్ర' మను గ్రంథమున వివరించితిని. కుతూహల మున్నవా రందు చూడగలరుగాన నా విషయ మిచట మరల దడవను. బ్రిటిషు ప్రభుత్వముపట్ల నాకు గల విశ్వాసము పెంపుననే నేను ఆ యుద్ధమున బ్రిటిషు పక్షము నవలంబించితిని.

బ్రిటిషు సామ్రాజ్య పౌరుల హక్కులు నాకు గావలెనని ఒకవంక గోరుచున్న నేను ఆ సామ్రాజ్య రక్షణమునకు సహము గట్టుట విధాయకము.

1100 మంది యున్న మా దళములో నలుబదిమంది నాయకు లుండిరి. ఆ యుద్ధసమయమున మేము దినమునకు 20, 25 మైళ్లు క్షతగాత్రులను మోసికొనుచు తిరుగుచుండెడివారము. శ్రీ వుడ్ గేటు సేనానివంటి వారినిగూడ అట్లు మోసెడిభాగ్యము మాకు లభించినది. మొత్తము ఆరు వారములు మాత్రమే మా దళము పనిచేసినది.

మా సల్పిన యీ యల్పసేవ యపుడు ప్రస్తుతి పాత్రమై, భారతీయుల ప్రతిష్ఠయు నధికమయ్యెను.

## 29

## వెలగల కానుకలు

యుద్ధసేవనుండి విడుమర కలుగగానే నాపని యిక భారతభూమిలోనేగాని దక్షిణాఫ్రికాలో గాదని తోచెను. మాతృభూమియందలి మిత్రములు నన్నింటికి దిరిగిరమ్మని అనురోధము సల్పుచుండిరి. స్వదేశమునసే మిక్కిలి ఉపకరింతునని నాకును దోచినది. కావున నన్నిక విడిచిపెట్టుడని నా సహచరుల నడిగితిని. వా రొకపట్టున నియ్యకొనరైరి. సంవత్సరములోపల వారికి నాతో అక్కరపడిన చో నేను వెంటనే తిరిగి వత్తునని ఒడంబడిన పిమ్మట వారు నా పోకకు సమ్మతించిరి. ఊరూర వీడ్కోలు సభలు జరపి నాకు వెలలేని పసదనము లిచ్చిరి. అందు వెండి బంగారునగలు, రత్నభూషణములుగూడనున్నవి.

ఈ బహుమతుల భారముచే నాకా రాత్రి నిదురపట్టినది కాదు. పడుక గదిలో నిటునటు ఆందోళిత మనస్కుడనై తిరిగితినే కాని ఉపాయమును తోచలేదు. వేలకొలది విలువగల ఆ కానుకలను ఉంచిపెట్టుట యొక కష్టము; దాచికొనుట అంతకంటె కష్టము అనిపించెను.

నేను వాని సంగీకరింతునే చూడుదు; మరి నా బిడ్డలమాట యేమి? నా భార్యమాట యేమి? ఇన్నాళ్ళు వారిని సేవావ్రత దీక్షితులుగా శిక్షించితిని. ప్రతిఫలము గోరని సేవయే సేవయని వారికి మప్పితిని.

ఇంటిలో మాకు నగలు నాణెములు లేవు. నానాట మేము పొదుపరి బ్రదుకున కలవడుచుంటిమి. అట్టి మా కీరత్నాంగుళీయకములు, పైడి గడియారములు, గొలుసులు నేటికి? భూషణములపై మోహము తగదని నే నప్పటికే ఇతరులకు బోధించుచుంటిని. ఇపుడు నా మీద వచ్చిపడిన యీ భూషణభారము నేమిచేతును?

వాని నుంచుకొన గూడదనియే తుదకు మనసు తెంపుచేసి కొంటిని. ఆ నగల నన్నిటిని ధర్మనిధిగా నేర్పరచి, దాని వినియోగమునకు పార్సీరుస్తుంజీ మున్నగు వారిని ధర్మకర్తలుగా నియమించుచు నొక లేఖ వ్రాసితిని. తెలవారిన పిమ్మట నా ఆలుబిడ్డలతో సంప్రదించి ఎట్టకేల కా బరువు వదల్చుకొంటిని.

నా బిడ్డ లిందులకు సమ్మతించుటలో జిక్కు కలుగదనియు, నా భార్య కొన్ని అడ్డదిడ్డములు చెప్పక మానదనియు నేను ముందు

గనే యెరిగినవాడను గాన నా తనయులచేతనే ఈ వ్యవహారము నడిపింప నిశ్చయించితిని.

వారు నా కోర్కెకు వెంటనే తలయూచిరి. 'ఈ నగలు మన కెందులకు? ఇచటి ప్రజాసంఘమునకే ఇచ్చివేయుదము. మనకు నగలు కావలసి వచ్చిననాడు సులభముగా చేయించుకొనవచ్చు' ననిరి.

నేను పరమానంద భరితుడనై 'మీ యమ్మతో చెప్పి యొప్పింపు' డంటిని.

వారును 'అట్లే చేయుదుము. ఆ భారము మాది. ఆమె ఈ నగలు పెట్టుకొనదు. మా కొరకు దాచి యుంచవలెననియే మక్కువ చెందును. మేము మా కక్కర లేదని చెప్పినచో అమ్మ ఎందులకు అడ్డము చెప్పును' అనుకొనిరి.

మరి అనుకొనినంత తేలిక పని కాదిది.

ఆమె నాతో 'ఇవి మీకక్కర లేకపోవచ్చును. మీబిడ్డలకు-మీరు పాడినదే పాటగాన - వారికి నక్కర లేకపోవచ్చును. వీనిని నేను పెట్టుకొనుటకు మీరు సమ్మతింపరని ముందే యెరుగుదును. మరి నా కోడండ్రమాట యేమందురు? వారికి నగలుండక తప్పదు కదా! రేపేమగునో ఎవరి కెరుక? అంత ప్రీతితో నిచ్చిన బహుమానములను వదలుకొనుట మాత్రము నావలనగాదు' అనెను.

వాద ప్రతివాదములు కొంతదూరమిట్లు ఎడ తెగక నడచిన పిమ్మట కన్నీటి ప్రవాహము గూడ నందులకు దోడయ్యెను. నగలను వదలుకొనవలెనను నా పట్టు నేను విడువలేదు. తుద కెట్లో ఆమె

ఒప్పించుసరికి దేవతలు దిగివచ్చిరి. 1896, 1901 సంవత్సరముల నాటి కానుక లన్నియు నిచ్చివేసితిని. నాదిగాని, ధర్మకర్తలదిగాని యభీష్టము చొప్పున ప్రజాహితకార్యములకు వినియోగించుటకై ఆ సొమ్మును బాంకులో దాచుటకై ధర్మనిధి పత్రము వ్రాసితిని.

ఈ పనిచేసినందులకు పిమ్మట నే నెన్నడు వగచినది లేదు. ఇందలి యౌచితిని నా భార్యయు క్రమముగా గ్రహించుకొనెను. ఈ పని పదపడి నన్నెన్నియో లోభములకు కాచి ప్రోచినది.

ప్రజారాధకుడు విలువగల కానుకలను పట్టదగదనియే నా దృఢాభిమతము.

# సప్తమ భాగము : మరల భారతభూమిలో

## 30

## నా మొదటి కాంగ్రెస్

మాతృభూమి చేరినపిమ్మట కొంతకాలము దేశ సంచార మొనర్చితిని. అది 1901 వ సంవత్సరము. కాంగ్రెసు మహాసభ కలకత్తాలో సమావేశమయ్యెను. శ్రీ (పదపడిసర్) దిన్షావాచా ఆ సభ కధ్యక్షులు. నే నా సభకు వెళ్ళకుండు టెట్లు? నా కదియే కాంగ్రెసు ప్రథమ దర్శనము.

కాంగ్రెసుకు దారి యడిగి ఒక స్వచ్ఛంద సేవకుని వెంట రిపన్ కళాశాల కరిగితిని. కాంగ్రెసు ప్రతినిధులచట చాలమంది విడిసి యుండిరి. స్వచ్ఛంద సేవకులు గజిబిజిపడుచు, నొకరి నేదేని అడిగినచో నింకొకరి కడకంపుచు, వారు మరియొకని చెంతకు బంపుచునుండిరి. ఇక బ్రతినిధులంటివా, వారి కొక నెల వనుచు లేదు.

ఎచట జూచినను మురికి కూపముగా నున్న దాస్థలము, అంతటను నీరునిలిచి చితచితలాడుచుండెను. మరుగుదొడ్లు కొన్ని యున్నవి కాని వానిని దలచికొన్నచో నేటికి నోకిరింతలు తప్పవు. స్వచ్ఛంద సేవకుల నీ కశ్మలతనుగూర్చి ప్రశ్నింపగా 'ఆపని మాది కాదు; పాకీవాండ్రది' అనిరి. నాకొక చీపురిండంటిని. వారు నా

వంక తెల్లబోయి చూచిరి. చీపురు సంపాదించి మరుగుదొడ్డి బాగు చేసితిని. ఆ బాగుచేత నాకొరకు చేసికొంటినేకాని తక్కిన వారి మాటయేమి? ఆమహాజనమునకు జాలినన్ని దొడ్లు లేవుగాన వానిని మరల మరల బాగుచేయవలెను. అది నా తలకు మించిన పని.

మరి రెణ్ణాళ్ళకు గాని సభారంభము కాదు. కాంగ్రెసు కార్యాలయములో నాకేదేని పని దొరకినచో కొంత యనుభవము కలుగును గదా యని యెంచితిని. శ్రీ గోసాలుబాబు భూపేంద్రనాథబాసులు కాంగ్రెసు కార్యనిర్వాహకు లగుటచే వారిలో భూపేంద్రబాబును 'నా కేదేని పని చెప్పుడు' అని యడిగితిని. ఆయన నన్ను తేరి కన్గొని 'నా చెంత పని యేమియు లేదు. గోసాలుబాబుకడ నున్నదేమో కనుగొను' మనెను.

గోసాలుబాబు నడిగితిని. ఆయనయు నన్ను పారజూచి, 'నాయొద్ద గుమాస్తాపని యున్నది. చేయుదురా?' యనెను.

'ఆహా, నాశక్తికి మించని పని యేదేని చేయుదు' నంటిని.

గోసాలుబాబు చొక్కాకు గుండీలను నౌకరే తగిలించెడివాడు కావున ఆపనిగూడ నేను చేయుచుంటిని. పెద్దల యెడ నాకెప్పుడును గురుభావమే. పిమ్మట వారికిది తెలిసినను నాచే నిట్టి పరిచర్య గొనుచున్నందుకు వా రన్యథా యెంచుకొనలేదు. వారి కిది యెంతయు సంతోషజనకము గూడ నయ్యెను. ఈ పరిచర్యచే నాకు గలిగిన లాభ మింతంతయని చెప్పజాలను.

కొలది నాళ్ళలో కాంగ్రెసు వ్యవహారమంతయు నాకళించుకొంటిని. చాలమంది నాయకుల పరిచితియు నాకు లభించెను.

దక్షిణాఫ్రికాను గూర్చిన కార్య నిశ్చయము (Resolution) నేను ప్రస్తావించుటకు సర్ ఫిరోజిషామెహతా సమ్మతించిరి. కాని ప్రస్తావనిర్ణాయక పరిషత్తు (Subjects committee) కెవరు, ఎపుడు దాని నెరుకపరతురా యని నేనక్కజమందుచుంటిని. ప్రతిప్రస్తావమును పెద్దలొకరు చేపట్టకతీరదు. ఒక్కొక్క ప్రస్తావమునుగూర్చి ఆంగ్ల మున సుదీర్ఘములగు ప్రసంగములు సాగరలిపోవుచుండెను. ఒక వంక చీకటిపడుచుండుట యరసి నాకు దడ జనించెను. సభ నుండి వెడలి పోవుట కందరు తొందరపడుచుండిరి. రాత్రి 11 గంటలయ్యెను. తెగబడి ప్రసంగించుటకు నాకు ధైర్యము చాలలేదు. నా ప్రస్తావ మును శ్రీ గోఖలే అంతకుమున్నే చూచియుండిరి కావున నేనువారిని సమీపించి 'నా సంగతి కొంచెము చూడరా?' యని చెవిలో మనవి చేసితిని.

ఇంతలో శ్రీ ఫిరోజిషామెహతా 'పని పూర్తియైనట్లేనా?' యనిరి.

'లేదులేదు. దక్షిణాఫ్రికా ప్రస్తావమట్లే యున్నది. దానికై గాంధి వేచియున్నాడు' అని శ్రీ గోఖలే కేకవైచిరి.

'మీరా ప్రస్తావమును జూచితిరా?' యని శ్రీ మెహతా ప్రశ్నించిరి.

'చూడకేమి?'

'మీకు నచ్చినదా?'

'చాల బాగుగా నున్నది.'

'ఇక నేమి, గాంధి! కానిమ్ము'

వణకిపోవుచు నేను ఆ ప్రస్తావము జదివితిని.
శ్రీ గోఖలే దానిని సమర్థించిరి.
'ఏకగ్రీవముగా' అని యందరు నరచిరి.

శ్రీ వాచా 'గాంధి! ఐదు నిముషములపాటు నీవా ప్రస్తావమును వివరింపు' మనిరి.

ఈ వ్యవహారమంతయు నా కించుకేని నచ్చదాయెను. ఆ ప్రస్తావమును గూర్చి తెలిసికొను ఆసక్తి అం దెవరికిని లేదు. వెడలి పోవుటకు దొందరపడుచుండిరి. శ్రీ గోఖలే చూచిరికదా యని సంతుష్టి చెందుటే కాని ఆ ప్రస్తావమును చూచి గ్రహించుకొన గోరిన వా రెవరును లేరు.

కాంగ్రెసు సభ దాని నెట్లో ఆమోదించుటే కావలసినదని నేను సంతుష్టి చెందితిని. కాంగ్రెసు ఆమోదించుట దేశమంతయు నామోదించినట్లే యని యెరిగిన వారికి సంతోషముగాక మరి యేమి?

## 31
## బొంబాయి నగరములో

నేను బొంబాయిలోనే ఉండి లాయరు వృత్తిచేసికొనుచు ప్రజాహిత కార్యముల దమకు దోడ్పడుచుండవలెనని శ్రీ గోఖలే అభిలషించిరి. అనుకొన్న దానికంటె నా రాబడి కొంత మెరుగు గానే యుండెను. దక్షిణాఫ్రికా యందలి నా స్నేహితులు తమ పనులు నా కప్పగించుచుంటచే నాకు గొంత వెసులుబాటు చిక్కెను.

నే నచటనే ఉండిపోనెంచి కొంచెము కాలు నిలద్రొక్కు-కొను చున్నంతలో దక్షిణాఫ్రికా నుండి ఆకస్మికముగా కేబుల్ వార్త వచ్చెను. 'శ్రీ చాంబర్లెయిను ప్రధాని ఇచటికి వచ్చుచున్నారు. తొందరగా దయచేయుడు' అను నా వార్త చూచుకొని, అచటి వారికి నే నిచ్చిన మాటను స్మరించి, 'సొమ్ము పంపిన వెంటనే బయలు దేరుదు' నని ప్రత్యుత్తర మంపితిని. వారు ఆలసింపక సొమ్ము పంపిరి. లాయరుపని కట్టిపెట్టి దక్షిణాఫ్రికాకు పయనము గట్టితిని.

# అష్టమ భాగము : మరల దక్షిణాఫ్రికాలో

## 32

## మరల దక్షిణాఫ్రికా

నేను దక్షిణాఫ్రికా చేరుట కొక్కదిన మాలస్యమైనచో దరుణము మించిపోయెడిదే. పనియంతయు నెచటి దచటనే ఉండి పోయెను. చాంబర్లైయిను మంత్రిని దర్శించు ముహూర్తమేమో నిశ్చిత మయ్యెను. ఆయనకు సమర్పింప వలసిన విన్నపమును సిద్ధముచేసి నేను గూడ ఇతరులతోపాటు ఆ మంత్రి చెంతకు రాయబారము పోవలసియున్నది.

చాంబర్లైయినుమంత్రి మమ్మంతగా నాదరింపక, 'మీ రెరుగుదురు కదా — ఈ వలస రాజ్యములు స్వతంత్రములని. సమ్రాట్ ప్రభుత్వపు టనుజ్ఞలలో నివి మెలగవు. మీకు అన్యాయము జరుగుచున్న మాట నిజ మనియే కన్పించుచున్నది. నాచేతనైనదేమో చేయుదును కాని మీ రీ ఐరోపియనుల మధ్య నుండవలసిన వారుగాన వారిని మంచి చేసికొనుట మేలు ' అనియెను.

ఈ మాటలతో మాకు కాళ్ళేతులు చల్లబడినవి. నాకును ఆశాభంగము కలిగెను. మా కనుల గ్రమ్మిన పొరలంతట వీడి పోయెను మా వ్యవహారమంతయు మరల మొదటికి వచ్చెను.

ఉన్న విషయమంతయు నూ వాం(డకు దెలియజెప్పి 'మీాకడ దాప రిక నెందులకు? నన్ను మీారు పిలిపించినపని యింతటముగిసి నట్లే. కాని, ఇంటికేగుటకు మీారు నన్ననుమతించినను, సాధ్య మైనంత పట్టు ట్రాన్సువాల్‌లోనే నేనుండిపోవుట మేలని తోచు చున్నది. తొల్లిటివలె నేటాలునుండికాక ఇచటనే యుండి నేను పనిచేయవలెను. ఇంకొక సంవత్సరమువరకు నే నింటికేగుట పడదు. కావున ట్రాన్సువాల్ సుప్రీము కోర్టులోనే నేను లాయరు వృత్తి సల్పుదును. ఈ క్రొత్త ప్రభుత్వశాఖతో వ్యవహరింపనేర్తునను ధైర్య మున్నది నాకు. మన మిపు డూరకయున్నచో మన కీ దేశమునుండి ఉచ్చాటన తప్పదు' అని వివరించితిని.

వెంటనే కర్తవ్యమునకు గడంగి, ప్రిటోరియాలో, జొహాన్సు బర్గులోనుండు భారతీయులతో సంప్రదించి జొహాన్సుబర్గులో ప్లీడరు వృత్తి ప్రారంభించితిని.

## 33

## గీతాధ్యయనము

గీతలన్నచో నా కాసక్తి మెండు. నా కప్పటికే వానిపై భక్తి కుదిరెను. వాని నింకను లోతుగా తరచి చూడవలసి యున్న దని నే నిపుడు తెలిసికొంటిని. మూలగ్రంథమును, నాకడ నున్న ఒకటిరెండు భాషాంతరీకృతుల సాయమున అర్థము చేసికొనుచు దినమునకు ఒండో, రెండో శ్లోకములను కంఠపాఠము చేయ సంక

ల్పించితిని. ప్రాతఃస్నానవేళలం దాపని చేయసాగితిని. పలు తోమికొనుటకు పదునేను, స్నానమునకు నిరువదియు నిముసములు పట్టునుగాన ఆ పనులు చేయునపుడు—శ్లోకలిఖిత పత్రముల నెదుటి గోడ కంటించి, ఎడనెడ వానిని దిలకించుచు వల్లెవేసెడివాడను. ఏనాటి శ్లోకము లానాడు వల్లించుటకు, ప్రాతవి నెమరువేసికొనుటకు ఆ సమయము సరిపోయెడిది. ఈ విధముగా పదుమూ డధ్యాయములు కాబోలు వల్లించితిని.

గీత నాకు శీలోపదేష్ట. నిత్యము సందేహాపదములందు నాకది ప్రమాణగ్రంథము. 'అపరిగ్రహము', 'సమభావము' వంటి మాటలు నాపాలిటికి మంత్రములైనవి. ఆ సమభావము నలవరచికొని వీడకుండు టెట్లు? నా సర్వస్వము వదలికొని స్వామి నాశ్రయింపవలెనా? ఈ ప్రశ్నములకు వెంటనే 'సర్వధర్మములను పరిత్యజించిన గాని నన్నాశ్రయింపలేవు' అని సమాధానమువచ్చెను. అంతట శ్రీ రేవాశంకరభాయికి నా యిన్సూరెన్సు పట్టమును అంతరింపజేసి, వచ్చినంత వట్టు రాబట్టుడనియు, అట్లు వీలుపడనిచో ఇంతకుమున్ను చెల్లించిన వాయిదాల సొమ్ము రద్దయినట్లే ఎంచదగుననియు, నన్ను, నా యాలు బిడ్డలను సృజించిన యీశ్వరుడే మమ్ము రక్షింపగలడను విశ్వాసము నాకు జనించెననియు వ్రాసితిని. నాకు దండ్రివంటివాడగు అన్నకు, 'నేనింత వరకు గూడబెట్టిన సొమ్మంతయు మీరు కైకొనుడు. ఇక నా గడనపై ఆసపెట్టుకొనకుడు. అది యెల్ల ఇచటి ప్రజలకే వినియుక్తమగును' అని తెలిపితిని.

# నన్ను మంత్రముగ్ధు నొనర్చిన గ్రంథము

మిత్రమగు శ్రీ పోలకు నన్ను దర్బానుకు సాగనంపుచు, త్రోవలో గాలక్షేపమునకై నాకొక పుస్తకమిచ్చి 'ఇది మీకు రుచించును, చదువు' డనెను. రస్కిను రచించిన 'అంటు ది లాస్టు' (unto the Last) అను గ్రంథమది.

చదువసాగినంతనే మంత్రముగ్ధుడ నైనట్లు ఆ గ్రంథమును విడువలేక పోతిని. జోహాన్సుబర్గునుండి దర్బాను కిరువదినాల్గు గంటల ప్రయాణము. ప్రొద్దు క్రుంకువేళ కచటికి జేరితిని. ఆ రేయి నిదుర పట్టలేదు. ఆ గ్రంథములోని ఉపదేశములవెంట నా జీవితమును దిద్దికొనవలెనను నిశ్చయ మేర్పడెను.

చిరప్రరూఢములగు నా యాశయములు కొన్ని ఆ పుస్తకమున బ్రతిఫలించుచున్నట్లు నాకు గన్పించెను. కావున నన్నది లోగొని నా బ్రదుకు తీరును దిద్దికొనజేసెను.

1 సమష్టి సౌఖ్యమే వ్యష్టి సౌఖ్యము.

2 వృత్తులన్నియు జీవనోపాధులేగాన లాయరు వృత్తియు మంగలివృత్తియు తుల్యగౌరవములే.

3 జీవన మన్నచో — కాయకష్టముచే బ్రదుకు కర్షకులది, చేతిపనులవారిదే జీవనము.

ఇవి, ఆ గ్రంథమందలి యుపదేశములని నాకు దోచెను.

ఇందు మొదటిది నా యెరిగినదే. రెండవదియు గొంతకు గొంత నా కనుభూతమే. మూడవది నాకు క్రొత్తది. వీనిలో

ద్వితీయ తృతీయములు ప్రథమోపదేశమం దంతర్భూతములే యని ఆ గ్రంథము నాకు గరతలామలక మొనర్చెను. ప్రొద్దుతో గూడ మేలుకొని ఆ యుపదేశముల నాచరింప గడంగితిని.

## 35
## ఫోనిక్సు వసతి

నే నపుడు 'ఇండియన్ ఒపినియన్' అను వారపత్రిక ప్రచురించుచుంటిని. పత్రికా ముద్రణకార్యము శ్రీ వెస్టు చూచుచుండెను. 'అంటు ది లాస్టు' చదువుటచే నాలో గలిగిన పరిణామమును గూర్చి ఆయనతో సంప్రదించితిని. మన మొక పొలములో వసతి యేర్పరచుకొని, పొలముపని చేసికొనుచు, తీరిక వేళల పత్రికా కార్యము చూచుకొనుచు, అందరము సమముగా దలకు మూడు పౌనుల చొప్పున నెలబత్తెము దీసికొనుచు బ్రదుకుదమని నేను చెప్పినంతట శ్రీ వెస్టు వల్లెయనెను. నెలబత్తెము విషయమున తెలుపు నలుపు భేదముతో బని లేదనుకొంటిమి.

ఈ విధముగా 1904 లో 'ఫొనిక్సు వసతి' అవతరించెను. అటనుండియే కడగండ్లను లెక్కసేయక 'ఇండియన్ ఒపినియన్' పత్రికను ప్రచురించుచుంటిమి.

ఇక ఇప్పటిలో స్వదేశమునకు వెళ్ళగలనను నాస వదలికొంటిని. సంవత్సరము దాటకుండ దిరిగివత్తునని నా భార్యతో జెప్పివచ్చినవాడను, ఆ గడువు దాటినను, బయలుదేరుటకు వీలు పడలేదు. కావున ఆలుబిడ్డల నిటకే రావింప నిశ్చయించితిని.

## జూలూ తిరుగుబాటు

కొంచెము తీరిక చిక్కిన దనుకొని సంతసించుచున్న తరుణమున అప్రతర్కితముగ నొక చిక్కు వచ్చి పడెను. నేటాలులో జూలూ జాతి తిరుగుబాటు చేసెనన్న వార్త పత్రికలందు పొక్కెను. జూలూలపై నా కెట్టి ద్వేషమును లేదు. వారెన్నడు భారతీయుల కపకృతి చేసియెరుగరు. కాని ఈ తిరుగుబాటు యుక్తమా యని నేను సంశయించితిని. బ్రిటిషు సామ్రాజ్యము లోకహితార్థ మేర్పడిన దని నే నపుడు నమ్ముచుంటి నాయెను. నేటాలు రక్షణకై వలంటీరు దళమొకటి యేర్పడియుండెను.

నేటాలుతో గాఢసంబంధమున్న నేనును నేటాలు పౌరుడనే యని యెంచికొని 'పనివడినచో భారతీయులము క్షతగాత్రులకు బరిచర్య చేయుదు' మని గవర్నరుకు విన్నప మంపితిని. ఆయన వెంటనే అంగీకరించెను.

నేను దర్బాను పురికేగి పరిచారకదళమున జేరుడని భారతీయులను కోరితిని. అచటి ప్రధాన వైద్యాధికారి నన్ను తాత్కాలికపు సార్జంటు మేజరును గావించి, నాకు నచ్చినవారిలో ముగ్గురను సార్జంట్లుగాను, ఒకరిని కార్పొరల్‌గాను నియమించుకొనుటకు నా కధికారమిచ్చెను. దీనిచే నా కుచితప్రతిపత్తి లభించి, పనిసుకరమగుటే కాక, సేనలో నట్లొసర్చు నాచారముకూడ కలదు గావున నేనా నియామకము నంగీకరించితిని. సర్కారు మాకు సైనికుల దుస్తుల నొసగెను. మా సేవాదళము ఆరు వారముల కాలము పరిచర్య

లోనరించెను. క్షతగాత్రులగు జూలూలకు బరిచర్య చేయుటయే మాపని. వైద్యాధికారి మారాక కెంతయు సంతోషించెను. తెల్ల వాండ్రు జూలూలకు బరిచర్య మనసార జేయమిచే క్షతగాత్రుల గాయములు క్రుళ్ళి విషమించు చుండెననియు, తన కేమి చేయుటకును దోచకుండె ననియు ఆ యధికారి చెప్పి, 'నిరపరాధులగు ఈ దీనుల పాలిటి ఈశ్వరుడే మిమ్ము బంపించె' ననెను.

## 37

## కస్తూరిబా ధీరత్వము

నాకు మిత్రమగు నొక వైద్యుడు కస్తూరిబాకు శస్త్ర చికిత్స అవసరమని చెప్పెను. ఆమె కొంతవడి సంశయించి తుదకు సమ్మతించెను. ఆమె చాల చిక్కిపోయి దుర్బలముగా నుండుటచే మత్తుమం దీయకయే శస్త్రచికిత్స నాత డొనర్చెను. చికిత్స చక్కగనే జరగెను గాని అపరిమితమగు బాధ కలిగెను. అద్భుతమగు ధైర్యముచే నాబిడ ఆ బాధ నంతటి నోర్చుకొనెను. వైద్యుడు నాయన భార్యయు నెంతో శ్రద్ధమై ఉపచారములుసల్పిరి. ఈ చికిత్స దర్బానులో జరిగెను. వైద్యుడిక నామెకు భయము లేదు. మీరు నిశ్చింతగా వెళ్ళవచ్చును ' అని చెప్పినమీదట నేను జొహాన్సుబర్గు కేగితిని.

కొలదినాళ్ళకే కస్తూరిబాయి స్థితి చెడినదనియు లేచి కూరుచుండ లేకున్నదనియు, నొకపరి స్పృహకూడ తప్పెననియు నాకు లేఖ యందెను. నా యనుమతి లేనిదే ఆమెకు మద్యమాంసము లిచ్చుట

అయుక్తమని యెంచి వైద్యుడు గోమాంస సారమును రోగికిచ్చుటకు టెలిఫోనుద్వారమున నా యనుమతి నర్థించెను. నేనందుల కనుమతింపజాల ననియు, కస్తూరిబా చెప్పగల స్థితిలోనున్నచో నామె యభిమతము వెంట నడచుకొనుట యుచితమనియు నేను దెలిపితిని. 'రోగి యభీష్టముతో నాకు బనిలేదు. మీరు రావలయును. నా యిష్టము చొప్పున పథ్యపానములు నడువనిచో మీ భార్య యేమగునో చెప్పలేను.' అనియెను డాక్టరు.

ఆ నాడే దర్బానుకు రైలెక్కి పోయితిని. వైద్యుడు నన్ను దరియవచ్చి 'మీకు జెప్పనప్పటికే శ్రీమతికి గోమాంససారము నిచ్చితి'నని చల్లగా దెలియ జెప్పెను.

నేను 'ఎంత మోసము చేసితిరండీ' అంటిని.

'రోగికి ఔషధమును, పథ్యము నిచ్చుటలో మోసపు ప్రసక్తియే యుండదు. రోగిని రక్షించుటకై రోగులను, తద్బంధువులను ఇట్లు మోసగించుట వైద్యధర్మము' అని ఆయన నిశ్చలముగ బదులు పలికెను.

నా మనస్సునకు జాలబాధ కలిగెను గాని తాలిమి వహించితిని. సజ్జనుడు, నాకాప్తమిత్రమునగు డాక్టరు నేమనగలను? ఆ యాలుమగ లిరువురు నా కొనర్చిన మహోపకార మెట్లుమరవగలను? అట్లయ్యు ఆయన చెప్పిన వైద్యధర్మమునకు మాత్రము తలయొగ్గలేను.

'అయిన దేదియో అయినది. ఇపుడు కర్తవ్యమేమి? నా భార్య ప్రాణముమీదికి వచ్చినను సరియే, మాంసాదు లిచ్చుటకు

నే నంగీకరింపను. ఆమె యిష్టపడి పుచ్చుకొన్నచో నేనడ్డము చెప్ప' నంటిని. ఆయన 'మీ నీతిధర్మములను నేను కాదననుగాని ఒక్క మాట చెప్పుచున్నాను, వినుడు. నేను చికిత్స చేయుచున్నంతవరకు ఆమె పథ్యపానములు నా యిష్టమువెంట జరగవలెను. మీ కిది సమ్మతము కానిచో నామె నిటనుండి తీసికొని పొండని, సవిషాదముగా, నేను చెప్పక తప్పదు. నా యింటిలో నామె మరణించుచుండగా నూరక చూచుచుండుట నా వలనగాదు' అని ఖండితముగా జెప్పి వైచెను.

అప్పుడు నా పుత్రులలో నొక డచటనుండెనని జ్ఞాపకము. ఆతడు తన తల్లికి గోమాంసరసము నిచ్చుటదోషమని చెప్పి నాతో నేకీభవించెను. కస్తూరిబా చాలనీరసించి యున్నది. ఆ స్థితిలో నామె నడిగి బాధించుట తగదని యెరిగియు అడుగుట నావిధియని యెంచి, డాక్టరుకు, నాకు జరిగిన సంభాషణము వినిపించితిని. 'గోమాంస రసము నాకు వలదు. పరమ దుర్లభమగు మానవజన్మమెత్తి శరీరము నిట్లు కలుషిత మొనర్చుటకంటె మీ చేతులమీదుగా వెళ్ళిపోవుటయే నాకు ప్రియ'మని ఆమె ఖండితముగా జెప్పివేసెను.

నే నామెకు బలువితముల జెప్పిచూచితిని. నీవు నన్ను సరింప నక్కరలేదంటిని. మనవా రెందరో మద్యమాంసముల నౌషధముగా సేవించుచుండి రని చూపిచెప్పితిని. ఎంత చెప్పినను ఆమె ససేమిరా యనెను. 'నన్నిటనుండి కొనిపొం'డని ప్రబతిమాలెను.

ఆటనుండి వెడలిపోవుటకే నిశ్చయించుకొంటిమి. రైలుస్టేషను దవ్వున నున్నది. వానతుప్పర పడుచున్నది. మేము దర్బానులో రైలెక్కి ఫోనిక్సులోదిగి అటనుండి మా విడిదికి రెండున్నర మైళ్లు

పోవలెను. అయినను దైవముపై భారముంచి నేను సాహసమున కొడిగట్టితిని 'ఆర్డరు మనుజులతో నొకనిని పట్టించుకొని నేను పలు. వేసినరు సిపాయిలకో డిసికొని స్టేషనుకు రండని ట్రీనెస్టుకు వార్త పంపితిని. కస్తూరిబాకొరకు కొక రిక్షావాలాను పిలిపించితిని. ఆ యమహా స్థితిలో నామెనం ఎక్కించి స్టేషనుకు గొంపోతిని.

కస్తూరిబాకు నేను ధైర్యము జెప్పవలసినది లేకపోగా ఆమెయే 'నాకు వచ్చిన భయములేదు. మీరా కలతజెందకుడుసు' నాకు ధైర్యము గరపెను.

అప్పటి కామె నోటిలోనికి మెతుకులుపోయి ఎన్నాళ్లాయెనో, శల్యావశిష్టయై యున్నది. స్టేషను ప్లాటుఫారము చాలపొడవుగా నుండెను. రిక్షానులోనికి బోనీయరు. కావున రైలుచెంతకు నడచి పోవలెను. నేనే ఆమె నెత్తికొని రైలులో గూరుచుండ బెట్టితిని. ఫీనిక్సు స్టేషనునుండి డోలీలోగొని పోయితిమి. అచట జలచికిత్సచే నామె యించుకించుకగా గోలుకొన్నది.

## 38

## ఇంటిలో సత్యాగ్రహము

ఒక కొన్నినాళ్లకు కస్తూరిబా మరల వ్యాధిగ్రస్తయయ్యెను. నా చేయు చికిత్సల కామె యెదురాడదుగాని వానియందు విశ్వాసము మాత్ర మామెకు లేదు. అటులని ఇతర వైద్యమును ఆమె కోరెడిది కాదు. నేను చేసిన చికిత్సలెల్ల నిష్ఫలములగుటు, ఉప్పును, పప్పు దినుసులు దినుట మానుకొమ్మని యామెను బతిమాలితిని. నే నెంత

చెప్పినను, ఎన్ని ప్రమాణములు చూపినను ఆమె నామాట విన్నది కాదు. తుద కామె 'ఒకరికి చెప్పుట కష్టముకాదు; మీరే మాన వలసి వచ్చినపుడుగాని తెలిసిరా' దని నన్నెత్తిపొడిచెను. నా మనసు చివుక్కుమనెను గాని ఒకయందుకు సంతోషము నుప్పతిల్లెను:—నా ప్రేమ మా యబలపై వర్షించుట కిది తరుణముగదా యని నే నంతట 'నీవు పొరపడుచున్నావు. నాకే జబ్బుగానుండి, వైద్యుడు పరిహ రింపు మనినచో, వీనినేకాదు. వేనినైన మరుమాట చెప్పకుండ బరిహరింతును. నీకు నమ్మకము లేదేని ఇదిగో, వైద్యుడు చెప్ప కుండగనే ఈ పప్పును, ఉప్పును సంవత్సరమువరకు నేను ముట్టను. నీవు మానుదువో. లేదో నా కక్కరలేదు' అంటిని.

ఈ నా ప్రతిన కామె నిర్ఘాతపడి 'నన్ను మన్నింపుడు. బుద్ధి మాలినదానను, మి మ్మెరిగియుండియు, న ట్లంటిని. మీ చెప్పిన ట్టీ పదార్థములు నేను వర్జింతును. మీ పున్నెమాయె, ఈ ప్రతిజ్ఞ ఉపసంహరింపుడు. నేనా బాధ భరింపలే' ననుచు బిట్టు విలపించెను.

'నీ వీవస్తువులు వర్జించితివేని మేలు కలుగును. సందేహము లేదు. ఇక నా మాట యంటివా, మనస్ఫూర్తిగా చేసిన ప్రతిజ్ఞ విడనాడుట నావలనగాదు. ఏకారణమున దాల్చినను ఇట్టి నిగ్రహము వలన నాకును మేలే చేకూరును. కావున నాకై విచారింపకుము నాకిది పరీక్ష. దీనిచే నీ మ్మాటను నిలిపికొనుటకు వలయు మనో బలము నీకును సమకూరు' ననుచు నా పట్టు విడువనైతిని.

ఆమె యంతట నాతో వాదించి ఫలములేదని యెంచి, 'మీ మంకుపట్టు మీదియేగాని ఒకరిమాట యెన్నడేని వింటిరి కనుక నా' యనుచు కన్నీరొద్దుచు మిన్నకుండెను. నా సత్యాగ్రహప్రయోగ

ములలో నిదియొక ఘట్టమగుటే కాక నా జీవితమున నిదియొక మధుర స్మృతియు నాయెను. పిమ్మట కస్తూరిబా త్వరితముగ గోలుకొనెను.

## 39

## సత్యాగ్రహోదయము

జూలూ తిరుగుబాటు ముగిసిన పిమ్మట ఫోనిక్సులో మిత్రుల గలసి కొంటిని. తరువాత జోహాన్సుబర్గు కేగితిని. అచట ట్రాన్సువాల్ సర్కారు 22–8–06 న విశేష గెజెటులో ప్రచురించిన ఆతురశాసనము (Ordinance) జదివి రిచ్చవడితిని. దక్షిణాఫ్రికా యందలి భారతీయుల కది సర్వనాశము దలపెట్టెను. అచట నివసించుట కర్హతగల స్త్రీ పురుషులు, ఎనిమిదేండ్లకు పై బడిన పిన్నలుగూడ ఆసియావాసుల రిజిస్ట్రారు కడ తమ తమ పేరులు నమోదుచేయించుకొని అనుమతిపత్రముల దీసికోనవలెనట. తమయొద్దనున్న ప్రాత పత్రములను రిజిస్ట్రారుకు దఖలుపరచి కొత్త పత్రములకు దరఖాస్తు పెట్టుకోవలెనట. అందు తమ పేరు, నివాసము, కులము, వయస్సు మున్నగునవి తెలుపవలెనట. దరఖాస్తుదారుని చహరాను (Identification marks) రిజిస్ట్రారు నమోదుచేసికొని, ఆతని వ్రేలి ముద్రలను తీసికొనునట. ఒక గడువు లోపల రిజిస్ట్రారుకు దరఖాస్తు లంపనివారు ట్రాన్సువాలులో నివసించు నర్హతను గోల్పోవుదురు. దరఖాస్తు లంపికొనకుండుటను నేరముగా నెంచి జరిమానా విధింతురట, బందె పెట్టుదురట, దేశభ్రష్టుల నొనర్తురట. రాచబాటపై నడచునపుడుగూడ అనుమతి పత్రములు చెంతనుంచికొని, అడిగినపుడు చూపింపవలెనట. ఈ పత్రముల పరిశోధనకై పోలీసుద్యో

గులు గృహస్థుల యిండ్లలో బ్రవేశింపవచ్చునట. లోకమున నెందును స్వతంత్రప్రజ నిట్టి శాసనమునకు గురిచేసిన ప్రభుత్వమున్నట్లు నేను కని విని యెఱుగను.

అచటి భారతీయులలో ముఖ్యులను మరునాడు కూడబిలిచి వారికీశాసన సారమును వివరించి చెప్పితిని. నావలెనే వారును నిర్ఘాతపడిరి. దారుణమగు ఈ సంకటమును గ్రహించి వారెల్ల నొక మహాసభను చేయుటకు సంకల్పించిరి.

11 — 9 — 06 న మహాజన సమావేశము జరిగెను. అపుడు చేసిన కార్య నిశ్చయములలో నాలుగవది అతి ప్రధానమై ప్రసిద్ధి కెక్కెను. ఇట్టి శాసనము చేయుట తగదని ప్రతిఘటించుటకును, ఆ ప్రతిఘటన నిష్ఫలమైనచో ఆ శాసనమునకు దలయొగ్గక, కష్టనష్టముల ననుభవించుటకును నాలుగవ ప్రస్తావమున కార్యనిశ్చయము జరగినది.

ఈ యుద్యమమున కేమి పేరు పెట్టవలెనో మాకు దోచినది కాదు. శ్రీ మగన్లాలుగాంధి 'సదాగ్రహ' మని పేరిడెను. సత్కార్యములందు స్థైర్యమని ఆ మాట కర్థము. ఆ పేరు బాగుగనే యున్నది. కాని నా మనసులో నున్నదంతయు నందు ప్రతిఫలింపమిచే నేను దానిని 'సత్యాగ్రహము' అని దిద్దితిని. ఇందు సత్యము ప్రేమను, ఆగ్రహము ప్రతిఘటన శక్తిని బోధించును. ఈ శక్తికి సత్య ప్రేమలె మూలకందము. ప్రేమ మనగా అహింస. అంతకు మున్ను వాడుచున్న 'తటస్థ ప్రతిఘటనము' (Passive Resistance) అను పేరు నంతట విడనాడి ఆ భారతీయోద్యమమునకు సత్యాగ్రహ మని నామకరణ మొనర్చితిని.

## కారాగృహవాసము

ఇట్లు తలయెత్తిన యుద్యమమును జిదుకబొడువవలెనన్న చో పతన్నాయకులను బంధించుట కర్తవ్యమని తలపోసి పసియాటికు డిపార్టుమెంటు మాలో గొందరిని బందెబెట్టెను.

మమ్ము అట్లు బందె నిడినంతనే మా వాంధ్రము జెయిళ్లునింప నిశ్చయించిరి.

బందిఖానాలో మాకు పక్షము దినములు గడచుసరికి క్రొత్తగా మరికొందరు జెయిలులోనికివచ్చి, ప్రభుత్వముతో రాజీబేరము సాగు చుండెనని వార్తగొని తెచ్చిరి. భారతీయులు తమంతదామే పేరులు నమోదు చేసికొనవలెననియు, అధికసంఖ్యాకు లట్లు బుద్ధిపూర్వక ముగా రిజిష్టరు చేసికొనిన పిమ్మట సర్కారీ నల్లశాసనమును రద్దు చేసికొనవలెననియు—ఇది ఆ రాజీసారము.

ఆ యొడంబడికకు నేనొక సవరణను సూచించితిని. దానిని గూర్చి స్మట్సుసేనానితో మాటలాడుటకై నన్ను ప్రిటోరియాకు గొంపోయిరి. ఒడంబడిక ముసాయిదా ఉభయులచే నంగీకృత మయిన పిమ్మట కారాగృహమునుండి మాకు విముక్తియొదవెను. ఆ యొడంబడికను నా ప్రజలకు వివరించి చెప్పుచు నేను కొన్నాళ్లు పలుతావుల సంచరించితిని.

## దండప్రహారణము

ప్రేలిముద్ర లిచ్చుటకు సమ్మతించితినని ఇరువురు పఠానులకు నామీద గుఱ్ఱుగా నుండెను. తొలినాడే ఉద్యమనాయకు లనుమతి పత్రములను గైకొనుట కేర్పాటు చేసికొంటిమి. సత్యాగ్రహ సమితి కార్యాలయము నా సొంతయాఫీసులోనే యుండెను. నే నట కేగుసరికి మీర్ ఆలం మున్నగు కొందరు పఠానులు వాకిట నిలిచి యుండిరి. మీర్ ఆలం వ్యవహారములు నేనే చూచుచుంటిని. పనిపడినప్పుడెల్ల నాతడు నాకడ కేతెంచెడివాడు. ఆత డారడుగుల యెత్తున ఒడ్డు పొడవుగల దృఢగాత్రుడు. ఎప్పుడును లోనికి వచ్చెడివా డానా డాత డేలనో వాకిట నిలిచియుండెను. అలవాటు చొప్పున నా కానాడు సలామును చేయలేదు. నేనే సలాము చేయగా నాతడు ప్రతిసలాము చేసెను. ఎప్పుడును మందహాసముతో ప్రసన్నముగా నుండువా డాతని కను లానాడు జేవురించియుండుట కనుపెట్టితిని. ఏదో మూడనున్నదని అనుకొంటిని. అధ్యక్షుడగు శ్రీ యూసఫ్ మయాన్ మున్నగువా రేతెంచినంతట ఆసియాటిక్ ఆఫీసు కందరము బయలుదేరితిమి. మీరాలం సమిత్రముగా నావెంట వచ్చుచుండెను.

మరి రెండుమూడు నిముసములలో రిజిస్ట్రారాఫీసుకు చేరుదు మనగా మీరాలం నాచెంత కేతెంచి 'ఎచటి కేగుచుంటి?' రని యడిగెను. 'నా పదవ్రేళ్ళ ముద్రలు నిచ్చి అనుమతి పత్రము తెచ్చి కొన బోవుచున్నాను. మీరు కూడ వత్తురేని మీ పత్రము ముందుగా నిప్పింతును. మీరు బొటనవ్రేళ్ల ముద్రలు రెండుమాత్ర మిచ్చిన

కాలునా, పిన్నాటు నా పాస్ పోర్టు ముద్ర లిచ్చి పత్రము దీసికొందు' నంటిని.

ఈ తుదివాక్యము ముగియకుండనే వెనుకనుండి నా తలపై చబుకుదెబ్బ పడెను. 'హేరామ' యనుచు నేలపైబడి నేను మూర్ఛిల్లితిని. పిన్నాటు మీరాలము, ఆతని మిత్రులు నన్ను కాల దన్నుచు, మరికొంత ప్రహరించిరట. అడ్డము సొచ్చిన శ్రీయుతులు యూసఫ్ మియాఖాన్ తంబినాయుళ్ళకు గూడ కొన్ని దెబ్బలు తగిలెనట కాని నాకు స్పృహ లేదు. కత్రోవ నేగుచు ఈ సందడి గాంచిన కొందరు శ్వేతపౌరులు గూడ నచటికి కేతెంచిరి. మీరాలము, నాతని మిత్రులు బారిపోవుచుండగా వీరు వెన్నాడి పట్టుకొనిరి. ఇంతలో నచటి కేతెంచిన పోలీసులకు వారి నప్పగించిరి.

ఒడలెరుగక పడియున్న నన్ను శ్రీ జె. సి. గిబ్సను కార్యాలయమునకు దరలించికొని పోయిరి. నేను కనులువిప్పి చూచుసరికి శ్రీ డోక్ నా దెసకు వంగి చూచుచు 'ఎటులున్నది మీకు?' అని యడిగెను. నేను 'బాగుగనే యున్నది కాని పలువరుసయు ప్రక్కలు నొప్పిగా నున్నవి. శ్రీ ఆలం ఏమాయెను?' అంటిని.

'ఆతని సమయాయులతో గూడ పోలీసులు బంధించిరి.'

'వారిని విడిపించవలెను.'

'అది యటు లుండనిండు కాని మీరిచట నొక యపరిచితునింట నున్నారు. మీ పెదవియు, చెక్కిలియు జీరుకొనిపోయి వాచి యున్నవి. పోలీసులు మిమ్ము ఆసుపత్రికి గొంపోవుదురు. కాని మా యింటి కేతెంచినచో నేను, నా యిల్లాలు మా చేతనైన యుప చారములు చేయుదుము.'

'మంచిది. నన్ను మీ యింటికే కొనిపొండు. పోలీసులకు నేను కృతజ్ఞుడనని తెలిపి మీ యింటికి వెళ్ళుదునని చెప్పుడు.'

ఇంతలో ఏసియావాసుల రిజిష్ట్రారు శ్రీ చామ్నీ కూడ నచటికే తెంచెను. శ్రీ దోక్ క్రయిస్తవ పురోహితుడు. ఆ సజ్జనుని యిల్లు స్మిట్టువీధిలోనున్నది. నన్నటకు గొంపోయి వైద్యుని రావించిరి. నేను శ్రీ చామ్నీతో 'నా పదివ్రేళ్ళ ముద్రలు నిచ్చి మొట్టమొదటి అనుమతి పత్రమును మీకడ గ్రహించు కుతూహలముమై మీ కార్యాలయమునకే వచ్చుచుంటిని. ఈశ్వర విలాసముచే త్రోవలో ఈ పని జరగినది. మీరా కాగితముల నిటకు దెప్పించి వెంటనే నాపేరు రిజిష్టరు చేయింప వేడెదను. నాకంటె ముందుగా మీరు మరియొకరిపేరు నమోదుచేయ జనదు' అంటిని.

శ్రీ చామ్నీ 'ఆపని కిపుడేమి తొందరవచ్చినది. ముందు డాక్టరును రానిండు. ఆయన వచ్చి చూచినమీదట మీరు విశ్రాంతి గైకొన్నచో నంతయు జక్కబడును. ఇతరుల పేళ్ళలోపల నేను నమోదు చేసినను ఆదిలో మీ పేరున కెడమఁంచియే చేయుదు' ననెను. నేను 'అట్లుకాదు ఈశ్వరానుగ్రహమున నేను బ్రదికియున్నచో మొదటి అనుమతిపత్రము తీసికొందునని ప్రతిన చేసితిని. కావున ఆ పత్రముల నిపుడే యిటకు దెప్పింపు' డని పట్టుపట్టితిని.

అంతట శ్రీ చామ్నీ ఆ పత్రములు గొనిరానేగెను.

నన్ను బ్రహరించిరని మీరాలం ప్రభృతులపై నేను నేరము మోపననియు వారిని దండించుటకై కోర్టు విచారణ నడుపవలదనియు, నా మాట మన్నించి వారిని వదలివేయుడనియు అటార్నీ జనరల్

పేర తంతివార్త పంపుట కర్తవ్యమని యెంచి ఆ పని చేసితిని. కాని జొహాన్సుబర్గు నందలి యూరోపియనులు అటార్నీ జనరలుకు 'దోషులను దండించు విషయమున గాంధి చెప్పెడి నీతిశాస్త్రము మా దక్షిణాఫ్రికాలో చెల్లుటకు వీలులేదు. గాంధి స్వయముగా దోషారోపణ చేయక పోవుగాక. ఈ యత్యాచారము రాచబాటపై జరిగినది కాన ప్రభుత్వ ముపేక్షించుటకు వీలులేదు. చాలమంది ఆంగ్లేయులే నేరమును జూచిన వారున్నారు. వారందరు కోర్టులో సాక్ష్యమీయగలరు. కనుక వ్యవహారము నడుపవలసినదే' యని కఠినముగా నొక లేఖ వ్రాసి యంపిరి. కావున అటార్నీ జనరలు మీరాలమును, మరి యొకరిని మరల బంధించెను. వారు మూడు నెలల కఠినకారావాస దండనమునకు పాత్రులైరి.

భారతీయ ప్రజ నుద్దేశించి సంపాదకుని ద్వారమున నేనిట్లు ప్రచురించితిని: 'శ్రీడోక్ దంపతులు నన్ను దమ తోబుట్టినవానివలె ఉపచరించుచున్నారు. కొలదినాళ్ళలో స్వస్థుడనై ఎప్పటివలె కార్య ప్రవృత్తుడ నగుదును.'

'నాపై చేయి జేసికొన్నవారు, పాపము తమ్ముదా మెరుగరు. నే నేదో అకార్యము చేయుచుంటినని వారు తలపోసిరి. వారికి చేత నైన ఈ ప్రతీకారము గావించిరి. కావున వారిపై నెట్టి చర్యయు జరపవలదు.'

ఇంతలో శ్రీ చామ్నీ అనుమతిపత్రములతో నచటి కేతెంచెను. అతి ప్రయాసముతో నేను వ్రేళ్ల గురుతులు ముద్రించి తిని. పాపము, శ్రీ చామ్నీ కనుల బాష్పము లొలుకుచుండెను. నే నాయననుగూర్చి పలుమారు పరుషముగా బత్రికలలో వ్రాసితిని.

కాని మానవ హృదయములు ఘటనావశమున ఆర్ద్రములగునని దీనిచే తెలిసి వచ్చెను.

## 42

## పునః సత్యాగ్రహము

భారతీయు లిట్లు బుద్ధిపూర్వకముగ దమంత తామే పేళ్ళు నమోదు చేయించుకొనిరి. కావున సర్కారు ఆ నల్ల శాసనమును రద్దుచేయవలసి యుండెను. స్మట్సు సేనాపతి దాని నుపసంహరింపక అట్లే యుంచి 'ఆసియావాసుల నింకను రిజిష్టరు చేయుటకై' మరొక శాసనము నిర్మింప మొదలెను. ఆ చిత్తుశాసనమును జదివి నేను విచ్చవడితిని.

సత్యాగ్రహు లపుడు సర్కారుకు తమ 'తుదిమాట' గా (Ultimatum) 'ఆసియావాసుల శాసనమును రద్దు చేయనిచో ఈ వరకు భారతీయులు పుచ్చుకొన్న సమ్మతి పత్రములను తగులబెట్టి ఆవల కాగల కార్యమునకు నిశ్చలముగా నొడిగట్టి యుందు' రని తెలిపిరి.

ప్రాత పత్రములను బరశురామ ప్రీతి గావించుటకై బహిరంగముగ సమావేశ మైతిమి.

సభ యారంభము కాబోవుచుండగా సర్కారు పంపిన తంతి వార్తతో నొక స్వచ్ఛందసేవకుడు సైకిలెక్కి యేతెంచెను. భారతీయుల యీపట్టుదల సర్కారుకు విచారకారణమైనదనియు, సర్కారు తన పని సాగించు ననియు వచ్చిన ఆ తంతివార్తను మహాసభలో

జనిని వినిపించి సంలేట, అగ్ని దేవునకు హోమము చేయ దలచిన సంతర్ప ణము ఆగిపోలేదుకదా యను సంతోషముచే సభ్యు లొక్కపెట్టున జప్పటలు చరచిరి.

మీరా ఆలంకూడ ఆ సభలోనుండెను. నా యెడల దాను సల్పిన అత్యాచారమునకు సంతాపించుచుంటినని చెప్పి నూవలె స్వయముగా అనుమతిపత్రము దీసికొనలేదు కావున తన పూర్వపు రిజిష్టరు పత్రమును దెచ్చి ఆ మంటల కాహుతిగావించెను. నే నాతని గాగిలించుకొని 'నీపట్ల నాకెట్టి కోపమును లేదు' అని మరొకమారు స్పష్టము చేసితిని.

మా కార్యనిర్వాహక సంఘమున కప్పటికి జేరిన 2000 పత్రములను కిరోసిను నూనెతో దడిపి శ్రీ యూసుఫ్ మియా చేతుల మీదుగా అగ్నిలో వేల్చితిమి. ఆ పత్రములు కాలుచున్నంతసేపు ఆ సభ కేతెంచిన వారెల్ల లేచినిలిచి ఆనందకోలాహలమున నుల్లి ట్లూగుచు జప్పటలు సరచుచునేయుండిరి. ఇంకను గొంద రప్పటి కప్పుడు తెచ్చియిచ్చిన పత్రములనుగూడ ఆభోగిమంటలో వైచితిమి.

ఆ సభ కేతెంచి ఈ వేడుకను గనులార గాంచిన ఆంగ్ల పత్రికాప్రతినిధులు తమ తమ పత్రికలలో నిదియంతయు వన్నె చిన్నెలతో జిత్రించిరి.

ఈ నల్లశాసనమును చేసినయేటనే స్మట్సుసేనాపతి ట్రాన్సు వాలుకు వలసవచ్చిన వారి నదుపుచేయు మరొక శాసనము (Transwal Immigrants Restriction Bill)గూడ నిర్మించెను. ఈ శాసనముచే ట్రాన్సువాలులో క్రొత్తగా నొక భారతీయుడుగూడ నడుగుపెట్టుట కాస్కారము లేకుండబోయెను.

నూతన దురాక్రమమునుండి తమ స్వత్వమును రక్షించుకొనుటకై ఆ శాసనమును ప్రతిఘటించుటకు భారతీయులకు దప్పని దయ్యెను. అందులకై కొందరు సత్యాగ్రహులు ట్రాన్సువాలుకేతెంచి బద్ధులు కా జొచ్చిరి. నన్నుగూడ మరల బందెబెట్టిరి.

1912 అక్టోబరు నెలలో, సర్కారుకు, సత్యాగ్రహులకు సమాధానము గుదుర్చుటకై శ్రీ గోఖలే దక్షిణాఫ్రికా కేతెంచిరి. ఒక సంవత్సరములోపల ఈ నల్ల శాసనమును, మూడు పౌనుల తల పన్నును రద్దుచేయుదు మని బోదా సేనాని శ్రీ గోఖలేకు మాట యిచ్చిరట. ఆ వాగ్దానము నెరవేరినది కాదు.

సర్కారు తమ మాట చెల్లించుకొనలేదని నేను శ్రీ గోఖలే పేర లేఖవ్రాసి సత్యాగ్రహోద్యమమును సమాయత్త మొనర్ప సాగితిని.

స్త్రీజనము చెరసాల కేగకుండ మేమందనుక వారించుచుంటిమి. దక్షిణాఫ్రికా ప్రభుత్వ మపుడొక వివాదలో దీర్పొకటి చెప్పుట తటస్థించెను. క్రిస్టియన్ల ఆచారము ననుసరించి పెండ్లిండ్లు జరగవలెననియు, వానిని పెళ్ళిళ్ళ రిజిస్ట్రారు కడ నమోదుచేసికొనవలెననియు అట్లు జరుగని వివాహములు చెల్లవనియు ఆ తీర్పుచే నేర్పడెను. అంతకు మున్ను హిందూ ముసల్మాను జోరాస్ట్రియను ధర్మాను సారము జరగిన వివాహములన్నియు ఇట్లొక్క కలముపోటుతో అశాస్త్రీయములై పోయెను. అట్లు వివాహితలగు స్త్రీలందరు నుంపుడుకత్తెలగుటయు, వారి సంతానమునకు ఆస్తిపాస్తుల వారసత్వము రద్దగుటయు సంభవించును. ఇది స్త్రీలకును, అంతకంటె బురుషులకును దుస్సహమై పోయెను.

మా నాటి లోకమునకు గళంక మాపాదించు నీ యవమానము నోర్చుకొనలేకపోతిమి. సత్యాగ్రహుల లెక్కతో నిమిత్తము లేకుండ చలముమై సత్యాగ్రహము నారంభ సమకట్టితిమి. సత్యాగ్రహమున జేరగూడదని స్త్రీల కీతూరి నిషేధము లేకపోవుటే కాదు. పురుషులతోపాటు నడుముగట్టుడని స్త్రీల నర్థించితిమి.

స్త్రీలనుగూడ బందెబెట్టుచుండిరన్న వార్త న్యూకాసిలు చెంత గనులలో పనిచేయువారి పాలిటి కావేశ మంత్రమయ్యెను. వారందరు పనిముట్లను బారవైచి తరతరముగా బదువులు గట్టి పట్టనమున బ్రవేశించిరి. నేనీ వార్త విన్నంతనే ఫీనిక్సు విడచి న్యూకాసిలు కేగితిని.

గనులు విడిచివచ్చిన పనివాండ్రసంఖ్య పదులుదాటి వందలలో బడెను. వేలలో బడుటకు సిద్ధముగా నుండెను. వీరందరికి దల దాచికొను చోటును, భోజనభాజనములు నెటు లమరల్పగలను? పని పాటులులేని యీ మహాజనము నొక్కచోట జేర్చి, కనుపెట్టియుంచుట అసాధ్యము, అపాయకరమునుగా గనుపట్టెను. నాకపుడొక యుపాయము తట్టినది. ఈ సేనను ట్రాన్సువాలుకు నడిపించికొనిపోయినచో నచట కారాగృహప్రవేశము సులభముగా లభించును. ఆ సేనలో నైదువేలమంది యుండిరి.

## 43

## సత్యాగ్రహ విజయము

నిరపరాధమగు వేలాదిజనమును బందెలో నిలిపిపెట్టు శక్తి యూనియన్ సర్కారుకులేదు. రాజప్రతినిధియు ఈ యకార్యమును సహించి యూరకొనడు. స్మట్సుసేనాపతి ఏమిచేయునోయని మానవలోక మెదురు చూచుచుండెను. అట్టి సంకటములందు ప్రభుత్వములన్నియు జేసెడిపనినే యూనియన్ సర్కారును చేసెను. విచారణకొరకొక కమిషన్ నియమించి దాటకొనుపోవు టొక్కటే ఇందులకుపాయము. ఆ కమిషన్ చేసెడి యుపదేశమును ప్రభుత్వము మన్నించుట పరిపాటి. సర్కారు తొలుత తాను నిరాకరించిన న్యాయమును కమిషను మాటను మన్నించు నెపమున, ప్రజలకు గల్గించును. స్మట్సుసేనానియు నట్లే ముగ్గురు సభ్యులుండు కమిషను నియమించెను.

కమిషన్ చేయవలసిన పనినిగూర్చి స్మట్సుసేనానికి నాకు జాబు జవాబులు నడచెను. మా యుభయులకు ఏకగ్రీవత కుదిరినది. భారత ప్రజల కోరికలను తీర్పవలసినదని ఆ కమిషన్ సర్కారుకు నివేదన మంపెను. నివేదన మందిన అనతికాలముననే సర్కారు గెజెటులో 'భారతీయులకు పరిహారము' అనుపేర చిత్తుశాసనము ప్రకటితమయ్యెను. మూడు పౌనుల తలపన్ను రద్దగుటయు, భారత భూమిలో శాస్త్రీయములగు వివాహములన్నిటిని ఇచటగూడ శాస్త్రీయములుగా నంగీకరించుటయు, బొటనవ్రేలిముద్రగల పత్రములను చూపిన ప్రాతకాపులందరికి దక్షిణాఫ్రికాలో ప్రవేశార్హత కలుగుటయు ఇవి .యు శాసనముచే నొనగూడును.

ఆ సత్యాగ్రహ మహాసమర మిట్లు ఎనిమిదేండ్లకు ముగిసినది. దక్షిణాఫ్రికా భారతీయులకు శాంతి లభించెను. 18-7-1914 న యింటిత్రోవపట్టి ఇంగ్లండున కేగితిని. గార్హస్థజీవనమునందలి తీపును చేదును అనుభవించుచు 21 సంవత్సరములు దక్షిణాఫ్రికాలో గడిపితిని. నా జీవనపరమార్థమున కచటనే రూపరేఖలు దిద్దుకొంటిని. అట్టి ఆభూమి నెడబాసి వచ్చుటకు నాకు సౌఖ్యమైనది కాదు.

# నవమ భాగము : ఇండియాలో - ఆశ్రమస్థాపనము

## 44

## పూనా నగరములో

ఇన్ని యేండ్లు పరదేశవాసము చేసి మరల మాతృభూమికి వచ్చుట పరమానందముగా నుండెను.

భారతసేవక సామాజికులును, శ్రీ గోఖలేయు నన్ను ఆదరముచే ముంచియెత్తిరి. శ్రీ గోఖలే సామాజికుల నందరిని సమావేశపరచిరని జ్ఞాపకము. వారియందరి పరిచయమును సంపాదించి నానా విషయములగూర్చి వారితో అరమరవీడి ముచ్చటించితిని.

మా ఫోనిక్సు కుటుంబముతో గూడ నివసించుట కొక యాశ్రమ ముండిన బాగుండు ననుకొంటిని. నేను ఘూర్జరుడను గాన ఘూర్జర మందే వసతికుదిరినచో ఘూర్జరులను, తద్ద్వారమున భారతప్రజలను సేవింపవచ్చు నని యాలోచన పొడమెను. శ్రీ గోఖలే 'నీ యాలోచన లెస్సగా నున్నది. ఆశ్రమ వ్యయభారము నేను చూచెదను. దాని నా సొంతముగా నెంచుకొందు'నని చెప్పిరి.

నా యానందము మేరమీరెను. ధనము సమకూర్చుభారము తప్పిపోవుటచే మిన్నెక్కినట్లు సంతోషించితిని.

## 45

## ఆశ్రమ స్థాపనము

25-5-1915 న అహమ్మదాబాదునందు కోచరాబులో సత్యాగ్రహాశ్రమము నెలకొల్పితిమి.

మేము స్త్రీ పురుషులందరు నిరువదియైదుగురము ఏకభాంఢాశనము చేయుచు, నేక కుటుంబముగా మెలగుటకు యత్నించితిమి.

ఆశ్రమమునకు గతిపయమాసములు గడచెనో లేదో, అప్పుడే అనుకొనని బెడద యొకటి యేర్పడెను. 'పేదవాడు, సజ్జనుడునగు అంత్యజు డొకడు తనకుటుంబముతో మీయాశ్రమమందుండునట. అంగీకరింతురా?' యని శ్రీ అమృతలాలుతక్కరు కడనుండి లేఖ యేతెంచెను.

ఆ కుటుంబమున నందరు మా యాశ్రమ నియమములను పాటింతురేని మాతోపాటు ఇచట నుండవచ్చునని బదులువ్రాసితిని.

వారందులకు సమ్మతించి ఆశ్రమమున వచ్చిచేరిరి. ఆశ్రమమునకు సాయమొనర్చుచున్న మిత్రుల కిది కొంత మనస్తాపహేతువయ్యెను. ముందుగా నీటిబావియొద్ద కలహమేర్పడినది. ఆ బావి ఇంటివారికిని, మాకును ఉమ్మడి కావున అచట ఏతము నాడించు నాతడు మా బిందెనుండి నీరు తనమీద చింది మైలపరచుచుండెనని ఆక్షేపించి, మమ్ము నిందింపనారంభించెను. వాని తిట్టులను గణింపక మీపని మీరు చేసికొనుడని ఆశ్రమవాసు లందరితో జెప్పితిని, మేము తన్ను ప్రతిభాష లాడమిచే నాతడు లజ్జించి మమ్ము దిట్టుట మానుకొనియెను.

ఆశ్రమ దాతలు మాత్రము మాకు దానమొసగుట నిలిపి వేసిరి. నాకు సంఘబహిష్కారముగూడ ప్రాప్తించుననువార్తలు పొక్కెను. మే మన్నిటికి నోరుగట్టియే యుంటిమి. మనపై ఆక్షేపించి, వెలిపెట్టినను సరియే అహ్మదాబాదును విడువగూడదనియు, అచటనే వెలివాడలో నివసించి, అచటి యంత్యజులతోపాటు కూలి నాలి చేసికొనుచు జీవింతమనియు మా వాండ్రకు నచ్చజెప్పితిని.

వ్యవహారము క్రమముగా శ్రుతిమించుటయు, నొకనాడు మగన్‌లాలుగాంధి 'మన సొమ్మంచి వట్టిపోయినది. పై నెలనుండి పస్తులే' యని ముందుగనే హెచ్చరించెను.

నేను కలవరపడక 'కానిండు. మాలగూడెమున కేగుదము,' అంటిని. ఇట్టి సంకటములు నాకు క్రొత్తకాదు. తుది ముహూర్తమున పరమేశ్వరుడే నన్నాదుకొనుట పరిపాటియై పోయెను. మగన్లా లిట్లు హెచ్చరించినకొలదినాళ్ళకే ఒకప్రొద్దుట ఆశ్రమ బాలకులు నాచెంత కేతెంచి 'ఎవరో సేటు మోటారుపై వచ్చి, ఆశ్రమము వాకిట నిలిచి మి మ్మడుగుచున్నా' డని తెలిపిరి. నేను సమీపింపగనే ఆ సేటు 'మీ యాశ్రమమునకు దాన మొసగవలెననియున్నది. పుచ్చుకొందురా?' యని యడిగెను.

నేను 'అంతకంటెనా! ఇపుడు చేతిలో సొమ్ములేక ఇరకటముగాగూడ నున్న' దంటిని.

'నేను రేపీ వేళకు వచ్చినచో ఉందురుకదా?' యనెను.

'ఉందు' నన్నంతట ఆయన వెడలిపోయెను.

చెప్పినట్లు మరునాడదియే వేళకు మోటారు వచ్చి నిలచెను. బాలురు వచ్చి చెప్పిరి. ఆ సేటు లోపలికి రాలేదు: నేనే వాకిటి

కేగితిని. రు. 13000 ల నోట్లు నా చేత నిచ్చి ఆయన మరుమాట పలుకక వెడలిపోయెను.

ఈ యీవి అతర్కితోపపన్నము. దీని నిచ్చిన భంగికూడ అపురూపము! ఆయన యీవర కెన్నడు ఆశ్రమమునకు వచ్చినవాడు గాడు. ఆయన నొక్కపరి కాబోలు నేను చూచితిని. లోపలి కేతెంచుటయూ, విచారణ చేయుటా, ఏమియు లేదు. సొమ్మును చేతిలో క్రుమ్మరించి చక్కపోవుట. ఇట్టి యీవి నే విన్నదియు, గన్నదియు గాను. ఒక సంవత్సరమువరకు మాకిక నిశ్చింత.

# దశమ భాగము : చంపారణ్యము

## 46

## నీలిమందు మచ్చ

చంపారణ్యమందలి కర్షకుడు తాను సేద్యముచేయు భూమియం దిరువదింట మూడువంతులలో, భూస్వామి కోసము, నీలిమందు పండింపవలెనను విధి యొకటి యున్నది. దీనిని తీన్ కతియా పద్ధతి యందురు. ఇరువది కత్తుల భూమిలో మూడు కత్తులని దీని యర్థము.

ఈ బాధ లనుభవించు వారిలో రాజకుమార శుక్లాయను నతడు నాకడ కేతెంచి తమ యిడుమలను కనులార గాంచుటకై చంపారణ్యమునకు రావలసినదని నన్ను గోరెను.

1917 ఆరంభములో కలకత్తానుండి చంపారణ్యమునకు బయలుదేరితిమి. చంపారణ్యమందలి కర్షకుల కష్ట సుఖములను గాంచి, నీలిమందు గుత్తదారులచే వారికగు అగచాట్లనుగూర్చి తెలిసికొను కుతూహలమున నే నచ్చటి కేగితిని. కావున వేలకొలదిగా నున్న యచటి సేద్యగాండ్రను కలిసికొనవలెను. రైతులను విచారించుటకు ముందుగా గుత్తదారు లేమి చెప్పెదరో వినుట మంచి దనుకొంటిని. దర్శన మిప్పింపుడని గుత్తదారులకు, డివిజనల్ కమీషనరుకు విన్నపమంపగా వారు సమ్మతించిరి.

గుత్తదారుల కార్యదర్శి నాతో 'మీరిచట క్రొత్తవారు. గుత్తదారులకు కర్షకులకుమధ్య మీకీ జోక్య మెందులకు? మీరేదేని చెప్పవలసినచో అదియెల్ల వ్రాసి పంపు' మని స్పష్టముగా జెప్పెను. 'నేను పరాయివాడ ననుకొనుటలేదు. కర్షకులకోరికపై వారి కష్ట సుఖములను విచారించుటకు నాకు అధికారము కల' దని నేను సవినయముగా బదులు పలికితిని.

పిమ్మట కమీషనరును దర్శింపబోగా ఆయన 'మీరు వెంటనే తిర్హూత్ నుంచి వెడలిపొం' డని నా కుపదేశించెను.

జరిగిన దంతయు నా సహచరుల కెరిగించి యిట్లంటిని: 'నన్ను సర్కారు ఇటనుండి ముందునకు పోనీయరేమో; నేననుకొన్నదాని కంటె మునుగనే నాకు కారాగృహ ప్రవేశమును సంభవించునేమో చెప్పలేను. నాకు బంధనము తప్పనిచో నది మోతిహారిలోనో, బేటి యాలోనో జరగుట మంచిది. కాబట్టి నేను వెంటనే ఆప్రదేశముల కేగుట మేలు.'

బీహారు రాష్ట్రమున తిర్హూత్ డివిజనులో చంపారణ్య మొక మండలము. మోతిహారి ఆ మండలమునకు రాజధాని. రాజకుమారశుక్లా నివాసము బేటియా సమీపమం దున్నది. అచటి వారు చంపారణ్యకర్షకులం దెల్ల నిరుపేదలు. వారి దురవస్థను నాకు జూపింపవలెనని శుక్లా కుతూహలపడెను. చూడవలెనని, అంతకంటె అధికముగా నేనును ఉబలాటపడితిని.

సహచరులు, నేను ఆనాడే మోతిహారికి బయనమైతిమి. మోతిహారి కైదుమైళ్ళ దూరములో నొక కర్షకు డవమానితుడయ్యె

నని మా కానాడే వార్త వచ్చెను. శ్రీ ధరణీధర ప్రసాదబాబుతో నేను మరునాటి ప్రొద్దుట ఆకర్షకునిజూడ నిశ్చయించి గజారూఢులమై ఆ యూరికి బయలుదేరితిమి. మేము సగముమేర దాటకుండగనే పోలీసు సూపరింటెండెంటు కడ నుండి వార్తాహరు డేతెంచి, వారి యభినందనము నా కందించెను. ఆ మాటల తాత్పర్యము గ్రహించి, ధరణీధరబాబును 'మీరు సాగిపొం' డని పంపి, నేనా వార్తాహరుడు తెచ్చిన అద్దెబండి నెక్కితిని. ఆత డంతట నన్ను చంపారణ్యమును వీడి పొమ్మను హెచ్చరిక పత్రము నా కందించి, ఆ హెచ్చరిక యందు నట్లు చేవ్రాలు చేయుడని కోరెను. నా విచారణ ముగియకుండ చంపారణ్యమును వీడనని ఆ పత్రముమీద వ్రాసియిచ్చితిని. అంతట నాతడు చంపారణ్యమును విడువవలసిన దను యాజ్ఞను ధిక్కరించిన నేరమునకు కోర్టులో విచారణకు హాజరుకావలసినదను ఆజ్ఞాపత్రము నా కందించెను.

నాకీ హెచ్చరికను, ఆజ్ఞాపత్రమును అందించిన వార్త కార్చిచ్చువలె నలుదెసల ప్రాకిపోయెను. మోతిహారిలో ఆనాడు అపూర్వమగు కోలాహలము చెలరేగెనట. గోరఖ్ బాబు గృహమునను, కోర్టునందును ప్రజల వెల్లువ పొంగిపోయెను. ఆ రేయియే నాపని యంతయు ముగించుకొంటినిగాన ఆ ప్రజాకోటి నడుమలో నుంచుటకు నాకు వీలు చిక్కెను. నే నెచటి కేగిన నచటికెల్ల నన్ను వెంటాడుచున్న ప్రజాసమూహమునకు సర్ది చెప్పుచు నా సహచరులు నా కెంతయో బాసటయైరి.

కలెక్టరు, మాజిస్ట్రేటు, సూపరింటెండెంటు మున్నగు నధికారులకు నాకు నొకరీతి నెయ్యమేర్పడినది. వారి ఆజ్ఞలను నేను ధిక్క-

రింపక అందుకొనుటయు, వారితో యథోచితముగ వర్తించుటయు గాంచి వారిపట్ల నాకు తిరస్కారభావము లేదని గ్రహించిరి. వారి ఆజ్ఞలను శాంతముగ ప్రతిఘటించుటయే నా యుద్దేశమని తెలిసి కొన్న మీదట వారి గుండెలు కుదుటబడెను. కావున నన్ను లేని పోని ఆయాసము పాల్పరచక. నేనును, నా సహచరులును ప్రజల నడుపులో నుంచుట నామోదించిరి. తమ యధికార దర్పమిక తొల్లిటివలె సాగదని నాటిప్రజావేశముచే వారికి దెల్లముగా దెలి సెను. ప్రజ లాసమయమున రాజదండభీతిని విడనాడి, తమ యీ క్రొత్త స్నేహితుని ప్రేమబలమునకు వశులైరి.

చంపారణ్యమునకు నేను క్రొత్తవాడనైనను ప్రజలు నన్ను చిరబాంధవునివలె ఆదరించిరి. ఆ యమాయిక కర్షకజనమును చూచినపుడు ఈశ్వరుడు, సత్యము, అహింసయు నాకు ప్రత్యక్షమై నట్లుండెను. ఇం దతిశయోక్తి ఆవంతయు లేదు.

చంపారణ్యమున గడపిన ఆ దినము ఈ జన్మమున మరపు రాదు. ఆ కర్షకులకు, నాకు నది మహాపర్వదినము.

కోర్టులో విచారగణ ఆరంభమయ్యెను. సర్కారు వకీలుకు, మాజిస్ట్రేటుకు ఇతరాధికృతులకు గూడ నేమిచేయవలయునో తెలియదాయెను.

తీర్పు వ్రాయుదానాడు నేను కోర్టుకు హాజరగుటకు మున్నే మాజిస్ట్రేటు నాపై దోషారోపణను లెఫ్టినెంటు గవర్నరు ఉపసంహ రించినట్లు నాపేర వ్రాసి యంపెను. కర్షకుల స్థితిగతులను నేను స్వేచ్ఛగా విచారించుకొన వచ్చుననియు, రాజోద్యోగులు వలసిన సాయ మొనర్తురనియు కలెక్టరుగూడ నాకు లేఖ వ్రాసి యంపెను.

ఈ వ్యవహార మిట్లు శుభపరిణామ మందునని మేమెవ్వరము నూహింపలేదు.

కర్షకులు తండతండములుగా నేగుదెంచి తమ కష్టనిష్ఠురము లను నివేదించిరి. వారివెంట వచ్చిన జనప్రవాహముచే మా విడిది యావరణమును, తోటయు నిండిపోయెను.

## 47

## కళంకము మాసిపోయినది

కష్టనివేదనము సల్పుటకై యేతెంచు కర్షకుల సంఖ్య నానాట పెరిగిపోవుట యరసిన భూస్వాములకు ఒడలు మండ సాగెను. నేను చేయుచున్న విచారణను మాన్పించుటకై వారు భూమ్యాకా శములను దల్లక్రిందు చేయసాగిరి.

లెఫ్టినెంటు గవర్నరగు సర్ ఎడ్వర్డు గెయిటు నన్ను చెంతకు రావించుకొని, ఈ వ్యవహారమును సాకల్యముగా విచారించుటకై తాము కొందరిని నియమింతుమనియు, వారిలో నన్నుగూడ చేర్చెద మనియు దెలిపిరి.

ఆ విచారణ కర్తలు కర్షకులపక్షముననే తీర్పుచెప్పిరి. భూస్వా ములు కర్షకులనుండి అన్యాయ్యముగా గుంజుకొనిన సొమ్మును మరల వారికిప్పింపవలసిన దనిరి. తీన్ కఠియా పద్ధతి శాస్త్రవిహితముకా దనియు, దానిని రద్దు చేయవలసినదనియు వారు సర్కారుకు నివేదించిరి.

అప్పటికి నూరేండ్లుగా సాగుచు వచ్చిన తీన్‌కఠియా పద్ధతి యిట్లు అంతరించి పోయెను. దానితో భూస్వాముల దొరతనము నస్తమించెను.

# ఏకాదశ భాగము : అహమదాబాదు కూలిజనము

## 48

## కూలిజనముతో సంబంధము

అహమదాబాదు కూలిజనమును గూర్చి శ్రీమతి అనసూయ బాయి నాకు లేఖ వ్రాసెను. అచటి కూలివారు తమకు కూలి చాలుట లేదని చాలకాలమునుండి ఆందోళన చేయుచుండిరి. వారి కొక దారిచూపి నడపింప గలనేమో చూడనెంచి అహమదాబాదు కేగితిని.

కూలివారిది న్యాయపక్షమని నాకు దోచెను. మిల్లు యజమానులకు శ్రీ అంబాలాలు సారభాయి నాయకుడు. శ్రీమతి అనసూయ ఆయనకు సోదరియయ్యు కూలీల పక్షము వహించి పోరుచుండెను. మిల్లు యజమానులతో నాకు మైత్రి కలదు. కావున నాకీ వ్యవహారము న్యాయము గోయియుగ నుండెను. యజమానులతో ముచ్చటించి చూచితిని. మధ్యవర్తి పరిష్కారమున కంగీకరింపుడంటిని. వారు పరిష్కార పద్ధతికి మాకు చుక్కెదురనిరి.

కావున కూలిజనముచే సమ్మెకట్టించితిని. సమ్మె ఆరంభించుటకు ముందు కూలివారితో, వారి నాయకులతో కలిపి గోలుగా మెలగి సమ్మె ఫలప్రదమగుటకు కొన్ని నియమము లున్నవని బోధిం

చితిని. 1 హింసాచరణము పనికిరాదు. 2 పనిలోని కేగువారిని బాధింప దగదు. 3 యాచించి జీవింపగూడదు. 4 సమ్మె యెంత కాలము సాగినను నిశ్చలముగా నుండి, న్యాయ్యమగు మరియొక బ్రదుకు తెరవున కాల మీదవలెను.

సమ్మెగాండ్రును, వారిలో పెత్తనదారులును ఈ నియమము లను గ్రహించి, అంగీకరించిరి. మహాసభాసమావిష్టులై అందరు 'మా కోర్కెలు మిల్లుదారులు తీర్చవలెను; లేదా, మధ్యవర్తి పరిష్కారమున కొప్పికోవలెను. అంతవరకు పనిలోని కేగము' అని శపథము చేసిరి.

రెండు వారములు గడచుదనుక సమ్మెదారులు ధైర్యమును, నిగ్రహమును వీడక ప్రతిదినము సభలు చేయుచుండిరి. ఆ సభలలో నేను వారి శపథములను జ్ఞప్తికి దెచ్చుచుంటిని. ప్రాణములు పోయినను శపథములు వీడమని వారు బిగ్గరగా నరచుచుండిరి.

పిమ్మట క్రమముగా దౌర్బల్య లక్షణములు తలచూపెను. నేను కలవరపడుచు నిపుడు నా కర్తవ్య మేమియని గాటపు టాలో చనలో బడితిని.

ఒకనాటి యుదయమున కూలివాండ్ర సభ జరుగుచుండెను. నేను తెన్నుగానక కొట్టుమిట్టాడుచుంటిని. ఇంతలో నా మనస్సున మెరపు మెరసినట్లై, అప్రయత్నముగా నానోట నీమాటలు వెలువడెను: 'సమాధానము కుదురుటో, మిల్లులు వదలిపోవుటో తేలువరకు మీరు కట్టుగానిలిచి సమ్మె సాగింపనిచో నేను అన్నము ముట్టను.'

కూలిజనుల కీ మాటలు పిడుగుపాటయ్యెను. అనసూయ బాయి చెక్కుల కన్నీరోడసాగెను. అంతట కూలిజనులు 'మీరు కాదు, మేమే ఉపవసింతుము. మీరు పస్తులుండుట ఘోరము. మా వలన తప్పయినది. మన్నింపుడు. ఇక కట్టుదప్పి చరింపము. మా చేసిన బాసలు తప్ప' మని ఘోషింపజొచ్చిరి.

'మీకు పస్తు లక్కర లేదు. మీరు చేసిన బాసలు పాలింపుడు, చాలును. మనకు విత్తబలము లేదనియు, బిచ్చమెత్తి జీవింపదగదనియు మీ రెరిగినదే. కావున మీరు ఏదియో కాయకష్టము చేసి కాలము నీడ్చుచుండుడు. అట్లు చేయుదురేని ఈ సమ్మె ఎంతకాలము సాగినను మీరు నిర్విచారముగా నుందురు. ఇక నా యుపవాస మంటిరా, ఈ సమ్మె ఫలించువరకు సాగవలసినదే' యని నేను బదులు పలికితిని.

తొలినాట సోదరి అనసూయయు, కొందరు స్నేహితులును, కూలిజనముగూడ నుపవాసముండిరి. నేను చాలదూరము బోధించి వారిచే నుపవాసము మాన్పించితిని.

దీనిచే కాలుష్యమడగి మనసులు నిర్మలములాయెను. మిల్లు యజమానుల హృదయములును కరగెను. వారంతట సమాధానమున కుపాయము వెదుక దొడగిరి. అనసూయ బాయి యింటనే వారందరు కూడబలికికొనసాగిరి. శ్రీ ఆనంద్‌శంకరధృవ పుణ్యమాయని దారి దొరకెను. వారే మధ్యవర్తిగానుండుట కెల్లరు సంగీకరించిరి. మూణ్ణాళ్లలో నా యుపవాసము ముగిసెను. మిల్లు యజమానులా శుభావసరమున కూలివారికి మిఠాయి పంచిపెట్టిరి. 21 దినములు సమ్మె సాగిన మీదట ఉభయులకు సమాధానము కుదిరెను.

# ద్వాదశ భాగము: ఖేడా సత్యాగ్రహము

## 49

## ఖేడా సత్యాగ్రహము

అహమదాబాదు సమ్మె ఒకవంక ముగిసెనో, లేదో, నా కించుక ఊపిరి యాడకుండగనే, ఖేడా సత్యాగ్రహము నా కొరకు సిద్ధమై, నే నందు ఉరుకవలసి వచ్చెను.

ఖేడా మండల మంతట పంటలు పాడైపోవుటచే కాటక మలముకొనుటకై పొంచి యుండెను. ఆ యేటికి శిస్తు వసూలు నిలుపు చేయుటకై సర్కారుకు విన్నవింపవలెనని అచటి పట్టాదారు లాలోచించుచుండిరి.

పంట నాలుగణాలకు (1/4 వంతు) మించనిచో ఆ యేటికి శిస్తు వసూలు నిలుపవలెనని సర్కారు నడుగవచ్చును. భూమిశిస్తు నియమము లిందుల కంగీకరించును. సర్కారు అంచనాలో ఆ యేటి పంట నాలుగణాలకు మించెను. తమకు నాలుగణాల పంట పండ లేదని రైతులవాదము. సర్కారీ వాదమును పెడచెవి నిడిరి. విన్నపములచే ప్రార్థనములచే ఫలముగానక, నేను సహచరులతో నాలోచించి పట్టాదారులు సత్యాగ్రహమొనర్చుటే మార్గమని చెప్పితిని.

ప్రజల నిర్భయత్వమును గాంచియు తొలితొలుత ప్రభుత్వము కఠిన చర్యలకు పూనలేదు. కాని ప్రజల పట్టుదల సడలమిగాంచి సర్కారు తీవ్ర నిరోధ చర్య నవలంబించెను. జప్తు చేసిన పశువులను అధికారులు వేలము వేసి యమ్మిరి. చేతికందిన చరాస్తి నెల్ల పట్టుకొని పోయిరి. అపరాధపు శిస్తు విధింతుమని హెచ్చరికలంపిరి. కొన్ని చోట్ల నిలువున నున్న పైరులనుగూడ జప్తు చేసిరి.

భయపడిన ప్రజల బెదరు తీర్పనెంచి నేనొక యుపాయము చేసితిని. ఒక పొలములోనున్న ఉల్లిపంటను అధికారులు జప్తుచేయుటలో పొరపడిరని నాకు తోచెను. అంతట శ్రీ మోహన్లాలు పాండ్యాను పెద్దనుగావించి, రైతు లాయన వెంట నేగి ఆ యుల్లిపంటను తెచ్చుకొనుడని చెప్పితిని. ఈ పనిచేసినచో జరిమానయో, బందిఖానయో తప్పదు. ఈ కష్టములను గోరి తెచ్చుకొనుట ప్రజల కలవరచుట మంచిదని యెంచితిని. ఈ పని శ్రీ మోహనలాలు పాండ్యాకెంతేని ప్రియము గావున అతడు సిద్ధపడెను. మరి యేడెనమండ్రు ఆయన వెంట నరిగిరి.

ఇంతటిపని జరిగినంతట సర్కారు మిన్నకుండదు కావున మోహన్లాలును, తదనుచరులను బందెలోనిడెను. ప్రజల కిది ఉత్సాహజనకమయ్యెను. బందె భయము తీరినపిమ్మట రాజదండనము ప్రజల యుత్సాహమునకే కారణమగును.

పాండ్యాను, తదనుచరులను బంధించి కొనిపోవుచుండ ప్రజలు వారివెంట ఊరేగింపుగా బయలుదేరిరి. పాండ్యా ఆనాడార్జించుకొన్న 'ఉల్లిదొంగ' యను బిరుదము నేటికిని చెల్లుచునేయున్నది.

పరువు చెడకుండ ఈ పోరాటమునుండి తప్పించుకొనుటకై సత్యాగ్రహికి సముచితోపాయమేదియా యని ఆలోచన మారంభించితిని. అనుకొనని ఉపాయ మొకటి తనంత నొరకెను. సంపన్నులగు పట్టాదారులు శిస్తు చెల్లింతురేని పేదవారిశిస్తు వసూలు నిలిపియుంతుమని నద్యాద్ తాలూకా మామ్లతుదారు నాకు గబురంపెను. ఆ మాట వ్రాసియిండని కోరినంతట ఆయన వ్రాసియిచ్చెను. ఈ యొడంబడికను మండల మంతట వర్తింపజేయగల అధికారము కలెక్టరుది. కావున మామ్లతుదారుమాట మండల మంతట వర్తించునా యని కలెక్టరు నడిగితిని. మామ్లతుదారు ఒడంబడికను మండల మంతట జెల్లించు ఆజ్ఞ లీవరకే పంపితినని కలెక్టరు తెలియజేసెను. ఇట్లు జరగెనని నే నెరుగను. ఇదియే నిజమైనచో పట్టాదారుల ప్రతిన నెరవేరినట్లే. వారు సాధింపగోరిన ఫలము నిదియే కావున కలెక్టరు పంపిన ఆజ్ఞచే మేము సంతుష్టి చెందితిమని చెప్పితిమి.

ఘూర్జర కర్షకుల కీ సత్యాగ్రహముచే కనువిప్పు గలిగెను. రాజకీయ వ్యవహారములందిది వారి కక్షరాభ్యాసమువంటి దయ్యెను. కష్టసహిష్ణుతను, త్యాగము నలవరచికొన్నవారికి విముక్తి కరతలామలక మను రహస్యము ఘూర్జరవాసుల మనస్సుల నాటుకొనెను. ఖేడా పోరాటముచే సత్యాగ్రహ బీజములు ఘూర్జరమున వేరుదన్నికొన్నవి.

# మృత్యువు చెంగట

నేనపుడు వేరుసెనగపప్పు, వెన్న, నిమ్మపండ్లు మాత్రమే తినుచుంటిని. మితిమీరి వెన్నతిన్నచో ఆరోగ్యము చెడునని యెరిగియు, దిని, జిగట విరేచనములు తెచ్చికొంటిని.

ఆ నాడేదియో పండుగ. మధ్యాహ్నమున నేనేమియు దిననని కస్తూరిబాయికి జెప్పితిని కాని యాబిడ బలవంతముచేయుగా మెత్త బడితిని. క్షీరములును, తజ్జన్యపదార్థములును వర్జించు నియమము నా కున్నదని ఆమె యెరిగినది కాన నా కొఱకా నాడు గోదుమతో తీయని జావచేసి అందు నేతికి మారుగా నూనె కలిపెను. నాకోసమని మినుపకట్టుగూడ మిగిల్చియుంచెను. ఆ పదార్థములపై నా కిష్టము కావున నించుక రుచిచూచినచో గస్తూరిబాయి సంతోషించు నని తిన నియ్యకొంటిని. సమయ మెప్పుడౌదవునా యని వేచియున్న హతవిధి ప్రేరణచే, జిహ్వాచాపల్యమునకు వశుడనై, కడుపార భుజించితిని. మృత్యువును పేరంటము పిలిచి నట్లాయెను నాపని. తిని గంటయైన గాకుండగనే జిగటవిరేచనములు తీవ్రరూపమున బ్రత్యక్షమైనవి.

నే నౌషధములు సేవింపను. చేసేత జేసిన దోసమునకు ఫలమనుభవింతు ననుకొంటిని. ఒకనాటిలో ముప్పది, నలువదిసార్లు లేవవలసివచ్చెను. ఫలరసముగూడ త్రావక శుష్కోపవాసము చేసితిని. ఆకలి చప్పగా నశించెను. మృత్యువు చేరువయైనదనుకొంటిని.

మిత్తిరాక కెదురుచూచుచు నేనిట్లు పడియున్న సమయములో శంకరలాల్ బాంకరు నారోగ్య రక్షణ భారమువహించి, డాక్టరు

దలాలుకు చూపింపుడని పట్టుపట్టెను. డాక్టరును బిలిచికొనివచ్చిరి. కర్తవ్యమును తక్షణమే నిశ్చయించు ఆ డాక్టరు ప్రజ్ఞ నన్ను ముగ్ధ నొనర్చెను.

'పాలుపుచ్చుకొనకున్నచో మీరు కోలుకొనరు. దానికి దోడు లోహమును, పాషాణమును ఇంజెక్షన్లు పుచ్చుకొందురేని మిమ్మెప్పటి యట్లు చేసెడిభారము నాది' అనెను డాక్టరు.

నేను 'వలసినచో ఇంజెక్షన్లు మాత్రము మీరిండు. పాలు మాట విడిచిపెట్టుడు. పాలు త్రావనని నా వ్రతము' అంటిని.

డాక్టరు 'ఆవ్రతమెట్టిదో కొంచెము వివరింపు' డని యడిగెను.

ఆ వ్రతము నెందుకు పట్టితినో ఆనుపూర్వ్యకముగా జెప్పితిని. గోమహిషముల పాలు పిండుటకై గొల్లలుచేయు అకృత్యములు చూచిన మీదట నాకు పాలపై రోతపుట్టిన దంటిని. అది యట్లుండ పాలు మానవశరీర స్వభావమునకు దగిన యాహారము కాదని యెంచి వర్జించితినంటిని. నే నిట్లు చెప్పుచుండ చెంతనేయుండి వినుచున్న కస్తూరిబా 'మేకపాలు మీకు నిషిద్ధము కావుకదా ?' యని అందు కొనెను.

డాక్టరంతట 'మేకపాలు త్రాగినను చాలును' అని మాట కలిపెను. నేను 'అట్లే కానిండు' అంటిని. ఎట్లైని బ్రదికి సత్యాగ్రహమును సాగింపవలెనను గాఢాభిలాష వలన ఈ మేకపాల వ్యాజముచే నా వ్రత రక్షసల్ప నియ్యకొంటిని. నిజమునకు నా వ్రత పరమార్థము భంగమై, నిస్సారమగు కట్టె మిగిలినది. ఈప్రతిన తాల్చి నపుడు గో మహిషముల క్షీరములే నామనసులో మెదలుచుండినను,

సకల జంతు క్షీరములకు ఆ ప్రతిన వ్యాపించి యుండను. అది యటు లుండ మానవ ప్రకృతికి క్షీరము సజాతీయాహారము కాదని నమ్మిన నేను క్షీర మాత్రము సంగ్రహించనే కూడదు. ఇది యెల్ల ఎరిగి యుండియు మేకపాల కియ్యకొంటిని. ఇది తలచికొన్నవో నేటికిని నాకు మనస్తాపము జనించుచుండును. ఈ మేక పాలను వదల్చుకొను ఉపాయ మాలోచించుచునే యుంటిని. కామము లన్నిటిలో అతి సూక్ష్మమగు ఈ లోకారాధన కామమునకు వశుడనై దాని పట్టునుండి నేటికిని విడివడ లేకున్నాను.

అది మొదలు మేకపాలు త్రావ సాగితిని. డాక్టరు దలాలు నాకు శస్త్రచికిత్స గావించిరి. నేను కోలుకొనుచున్న కొలది బ్రదుకుపై వాంఛ మరల చివురు తొడిగెను. పరమేశ్వరు డింకను నాచే నేమి చేయింప నుండెనో!

## త్రయోదశ భాగము:
## రౌలటు శాసనము, రాజకీయములలో ప్రవేశము

### 51

### రౌలటు శాసనము

నే నింకను పూర్తిగా కోలుకొనక పూర్వమే రౌలటు కమిటీ నివేదనము యాదృచ్ఛికముగా నేను వార్తా పత్రికలలో జదివితిని. అప్పుడే ప్రకటితమైన ఆ నివేదనమందలి యంశములు నన్నాశ్చర్య చకితుని గావించెను. దిన దినము నన్ను జూడ నేతెంచు వల్లభాయికి నా భయ సందేహములు దెలిపి 'దీనికేదేని ప్రతిక్రియ చేయవలసి యుండు' నంటిని. ఆతడు 'ఇపుడు మనము చేయగలిగిన దేమి యున్నది?' అనెను. 'దీనిని ప్రతిఘటింప బ్రతిన పూనువారు పది మంది యున్నజాలును. ఆ ప్రతిఘటనను లక్ష్యింపక సర్కారు ఈ శాసనము నిర్మించినచో వెంటనే సత్యాగ్రహ మారంభించవలెను. నే నిట్లు ఎత్తుపడితినిగాని లేకున్నచో నొంటరినై దీని బ్రతిఘటింతును. నన్ను అనుసరించువా రుండక పోరు. ఈ నీరసస్థితిలో ఇంతటి భారము సహించలే ననిపించుచున్నది' అంటిని.

రౌలటు బి ల్లింకను శాసనరూపమున గెజెటులో ప్రకటితము కా లేదు. నే నట్లు నీరసముగా నుండగనే మదరాసు నుండి పిలుపు

వచ్చెను. దైనముపై భారమిడి ఆ దూరప్రయాణము చేసితిని. శ్రీ రాజగోపాలాచారి అంతకుమున్నే సేలము విడిచిపెట్టి మదరాసులో ప్లీడరు వృత్తి ప్రారంభించెను. రౌలటు బిల్లును ప్రతిఘటించుటెట్లు లని దిన దినము నెంత చర్చించినను బహిరంగసభలు చేయుట కంటె నితరోపాయము నా కేమియు గన్పించలేదు.

మే మిట్లు ఆలోచించుచుండగనే రౌలటు బిల్లు శాసనమై ప్రకటితమాయెనని మాకు వార్తవచ్చెను. దానిని గూర్చిన యాలోచనతోనే ఆ రాత్రి నిద్రకు బడితిని. వేగు జామున నించుక పెందల కడనే మెలకువ వచ్చెను. నిదురయు, మెలకువయుగాని య తెరపి మరపు టవస్థలో, స్వప్నమందువలె ఆలోచన తట్టినది. తెలవారిన పిదప రాజగోపాలాచారి కా కథయంతయు జెప్పితిని.

'దేశమంతట హర్తాళ్ జరిపించవలెనని గతరాత్రి నేను కల గంటిని. సత్యాగ్రహ మనునది పాపశోధనమువంటిది. మనము చేయబోవునది ధర్మయుద్ధముగావున ముందు ప్రాయశ్చిత్తరూపమగు హర్తాళ్ సలుపుట యుక్తము. ఆదినమున ప్రజలెల్లరు దమతమ వ్యాపారములు కట్టిపెట్టి, ఉపవసించి, ఈశ్వరప్రార్థన సల్పవలె' నంటిని.

రాజగోపాలాచారి నా యాలోచనము లెస్సగా నున్నదనెను. ఇది విన్న ఇతరస్నేహితులు గూడ ఆహ్లాదించి, హర్షించిరి. ప్రజల కొక విన్నపమును ప్రకటించి, 30-3-1919 హర్తాళ్ చేయుట కేర్పర చితిని. పిమ్మట దానిని 6-4-1919 కి మార్చితిమి.

ఆనాడు ఆసేతు హిమాచలము పల్లెలలో, పట్టణములలో ప్రజలందరు హర్తాళ్ జరపుట పరమాశ్చర్యము ఘటించెను.

7 వ తేదీ రాత్రమున నేను ఢిల్లీకి, అమృతసరమునకు బయలుదేరితిని. రైలు పాల్వాల్ స్టేషనుకు చేరనున్న వేళ పాంచాలపు హద్దులు దాటవలదను నిషేధాజ్ఞ సర్కారు నా కందించిరి. నే నచటికి కేగినచో శాంతిభంగ మగుననిరి. నన్ను రైలునుండి యచట దిగుమనిరి. 'నన్ను పాంచాలవాసులు పిలుచుటచే నచట శాంతి నెలకొల్పుట కేగుచుంటినేకాని అశాంతి కలిగించుటకు గాదు. కావున ఈ నిషేధాజ్ఞ ననువర్తింపజాల' నని నిరాకరించితిని.

పాల్వాల్ స్టేషనులో నన్ను దింపి పోలీసుల అధీనమందుంచిరి. ఢిల్లీనుండి వచ్చిన రైలుబండిలో మూడవతరగతిగదిలో నన్నెక్కించి, పోలీసు బలగముకూడ ఎక్కెను. మధుర చేరగానే నన్ను పోలీసు బారకాసులకు (Barracks) గొనిపోయిరి. ఆ పిమ్మట నన్నేమి చేయవలెనో, ఎచటికి గొంపోవలెనో ఆ పోలీసు అధికారులకుగూడ తెలియదు. తెలవారువేళ 4 గంటలకు నన్ను నిద్ర మేల్కొలిపి బొంబాయి కేగు కుడ్సు బండిలో నెక్కించిరి. బొంబాయి చేరగనే నన్ను విడిచిపెట్టిరి.

నన్ను నిర్బంధించిన వార్త బొంబాయిలో అలజడికి గారణమయ్యెను. నేను మోటారు నెక్కి యేగుచుండ పైధుని చెంత మహాజన సమూహము కనుపించెను. నన్ను గనుగొన్నంతనే ప్రజలానందపరవశులై ఊరేగింపు బయలుదేర దీసిరి. వందే మాతరం, అల్లాహో అక్బరు అను ధ్వనులచే మిన్నులు బీటలు వారుచుండెను. పైధునిలో అశ్వారూఢమగు పోలీసు దళము గన్పించెను. పైనుండి రాళ్లు వర్షించుచుండెను. ప్రజలను శాంతింపజేయ జూచితినికాని రాళ్ళ దెబ్బలు తప్పించుకొను మార్గము కన్పించలేదు. ఊరేగింపట్లె

సాగి అబ్దుల్ రహ్మాన్ వీధి దాటి, క్రాఫర్డు మార్కెటుత్రోవపట్టెను. అచటి ఆశ్వికదళము త్రోవ నరికట్టి పోట్టుదెసకు ప్రజలను బోనీయకుండ వారించెను. అతివేలముగా గ్రిక్కిరిసియున్న జనసమూహము పోలీసుల అడ్డుకట్టను మీరిపో వడగెను. ఆ జన కోలాహలములో నామాట వినుపించుకొను వారెవరు? అంతట పోలీసు అధికారి మూకలను చెదరగొట్టుడని భటుల కాజ్ఞ నొసగెను. అశ్వారూఢులగు రాజభటు లపుడు భల్లములు సారించుచు ప్రజలపై కళ్ళెముల నడిపించిరి. నేనుగూడ గాయపడుదునని క్షణమాత్ర మనుకొంటిని కాని బల్లెములు మా మోటారును మాత్ర మొరసి కొనుచు వెడలిపోయెను. అనతికాలముననే ప్రజా సమూహము విచ్చిపోయెను. ఎచటి వా రచట త్రోవగానక చెదరి పరుగిడ జొచ్చిరి. కొందరు అశ్వపదాహతులచే నలిగులి యైరి. కొందరు నజ్జునజ్జయిన దేహములతో బయట బడిరి. ఇసుక వైచిన రాలని ఆ జన సమ్మర్దములో గుఱ్ఱములు నడచుటకు సందుగాని, ప్రజలు చెదరి పోవుటకు తెరపి గాని లేదు. ఆశ్వికులు కనులుమూసికొని మూకలపైకి తురగముల నడిపించుచుండ, వారది తెలిసి చేయుచున్న పని యనుకొనుట కష్టమై పోయెను. అంతయు బీభత్సముగా నుండెను. ఒడలు తెలియని ఆ చిందులలో, శివాలలో ఆశ్వికులు బ్రజలు నొండొండ బెరసి కొనిపోయిరి.

ప్రజ లిట్లు చెదరిపోయిన పిమ్మట మా మోటారు బండికి దారి యిచ్చిరి. నేను మాబండిని పోలీసు కమీషనరు కార్యాలయము కడ ఆపి, పోలీసుచర్యనుగూర్చి కమీషనరు కాక్షేపము దెలుపుటకై దిగితిని.

అహమదాబాదులోగూడ అల్లరులు జరిగెనని వార్త యే తెంచెను. నేనంతట నచటికి బయనమై పోయితిని. నాడియాడ్ స్టేషనుకడ ప్రజలు పట్టాలు తొలగింప జూచిరనియు, వీరాంగామలో ప్రభుత్వోద్యోగి ప్రాణముల గొనిరనియు, అహమదాబాదులో సైనిక శాసనము చెల్లుచుండెననియు దెలిసెను. ప్రజలు భయభ్రాంతులై పోయిరి. తాముచేసిన అత్యాచారములకు వడ్డితో ఫలమనుభవింప వలసినవారై ముచ్చుమునిగి యుండిరి.

నన్ను పోలీసుకమీషనరు చెంతకు గొనిపోవుట కొక యధి కారి రైలుస్టేషనులో వేచియుండెను. కమీషనరు ఆగ్రహోదగ్రుడై మండిపోవు చుండెను. నేను చల్లగా శాంతి వాక్యములు బలుకుచు, ఈ దుండగములు జరగినందుకు నేను చెందు మనస్తాపము బ్రకటించి తిని. సైనికశాసనముతో బనిలేదని మనవిచేసితిని. శాంతి నెల కొల్పుటకై చేయగలవట్టు సాయ మొనర్తునంటిని. సబర్మతీ ఆశ్రమ ప్రదేశమున బహిరంగసభ సల్పుట కనుజ్ఞ గోరితిని. నా కోరిక ఆయన మనసునకు వచ్చెను. ఏప్రిలు 13 వ తేది ఆదివారమునాడు శాబోలు సభజరగెను. ఆనాడోమరునాడో సైనికశాసన ముపసంహృత మయ్యెను. ప్రజలొనర్చిన దుండగపు బనులు వారిమనస్సుల కెక్కు నట్లు సభలో బ్రసంగించితిని. ఆ దుండగములకు బ్రాయశ్చిత్తముగా నేను మూణ్ణాళ్ళుపవసింతునని ప్రకటించితిని. ప్రజలందరి నొకదిన ముపవసింపగోరితిని. ఘాతుకగార్యములు సల్పినవారు తమ దోషము లను ప్రకటముగా నంగీకరించుట యుక్తమని సూచించితిని.

నాకు గర్తవ్యము కనులగట్టినట్లు కన్పించెను. ఇచటి మిల్లు పనివాండ్ర క్షేమముగోరి. వారితో కలసిమెలసి చాలదినములుండి వారిని సేవించుకొంటిని. అట్టి మిల్లుపనివాండ్రు యుక్తాయుక్త వివేకము గోల్పోయి రన్నచో ఆపాపకార్యమున నాకును భాగమున్నట్లే.

శాంతవర్తనమున ప్రజలు సుశిక్షితులగు పర్యంతము సత్యాగ్రహము నుపసంహరించుట యుక్తమని నిశ్చయించుకొంటిని.

# చతుర్దశ భాగము : ఖాదీపుట్టుక

## 52

## ఖాదీ పుట్టుక

సబర్మతిలో సత్యాగ్రహాశ్రమము నెలకొల్పి నపుడే కొన్ని చేమగ్గములగూడ నచట నేర్పాటుచేసితిమి.

ఆశ్రమవాసులందరము స్వయముగా నేసికొన్న వస్త్రములనే ధరించవలయునను నేమము గలదు కావున మేము మిల్లునేత గుడ్డలను ధరించుట మాని, మిల్లునూలుతో నేసికొన్న బట్టలనే వాడుచుంటిమి. మా మిత్రులను గూడ నట్లు చేయుడని ప్రోత్సహించుచుంటిమి కాన మన దేశపు నూలుమిల్లులకు మేము జీతబత్తెములు లేని ఏజెంట్లమైతిమి. ఈవిధముగా మాకు నూలు మిల్లులతో చుట్టరిక మేర్పడెను. మిల్లు నూలు నంతటిని మిల్లులోనే నేయుట మిల్లుదారుల యభిలాషయనియు చేనేతవారిచే తాత్కాలికముగా, విధిలేక నేయించుచుటే కాని వారి యీప్సితమది కాదనియు మేము గ్రహించితిమి. దీనిచే, నూలు గూడ మనమే వడకికొనవలయునని మాకు తొందరపుట్టెను. అట్లు వడకికొనకున్నచో మన కీ మిల్లుల చెర తప్పదని స్పష్టపడెను. మిల్లు నూలు వాడుకను ప్రోత్సహించుటచే దేశమునకు గలుగు మేలేమియు నుండదనియు మేమనుకొంటిమి,

మా కెందును నూలురాట్నము గాని, వడకుటను నేర్పువారు గాని కన్పింపరైరి.

ఆశ్రమమునకు వచ్చిపోయెడివారిలో, ఈ వృత్తిని గూర్చి యెరిగియుందురనుకొనిన వారినెల్ల అడిగి చూచితిని.

1917 లో విద్యావిషయకమగు సభయొకటి బ్రోచిలో జరగెను. గుజరాతి మిత్రుల కోరికపై నేనా సభ కధ్యక్షత వహించితిని. శ్రీమతి గంగాబాయి మజుందారనే పెద్ద యిల్లాలు నాకచట నగపడెను. చరఖాను గూర్చిన నా సొద యామెతో వెళ్ళబోసికొంటిని. అప్పుడామె చరఖా యెచటనున్నను సాధించి పట్టుకొందునని మాట యిచ్చెను.

ఆయమ గుజరాతంతట గాలించి గాలించి, తుదకు బరోడాసంస్థానమున విజాపురమున చర్ఖాను పట్టుకొనెను. చాలమంది యిండ్లలో నచట నీ రాట్నము లుండెను గాని వాని నెన్నడో అటకలపై బారవైచిరి. తమ కెప్పటి కప్పుడు ఏకులిచ్చువారును, వడికిన నూలు కొనువారు నున్నచో మరల వడుకుదుమని ఆయూరివా రనిరి. గంగాబాయి ఈ శుభవార్త నా కెరిగించెను. ఏకులు చేయించి యిచ్చుట కష్టముగా గన్పించెను. నే నీ మాట కీర్తిశేషులగు ఉమార్ సొబానితో నంటిని. ఆయన వెంటనే వలసినన్ని యేకులు తనమిల్లునుండి పంపింతునని చెప్పి మా కష్ట మీడేర్చెను.

పోయిన పోడవున ఆయనవలననే ఏకులు సంపాదించుట నాకు రుచించలేదు. అదియునుగాక మిల్లులో చేసిన యేకులు వాడుట దోషమనిపించెను. మిల్లుల యేకులు పనికివచ్చుచో మిల్లునూలు మాత్ర మేల పనికిరాదు? మన పూర్వులకు ఏకుల నీ మిల్లులే

ఇచ్చినవా? మరి వారి కేకు లెట్లులభించినవి? ఈ యాలోచనలతో మరల గంగాబాయినే అడిగితిని: 'ఏకులు చేయువారు దొరకరా' యని. 'ఏల దొరక' రని చెప్పి, దూది ఏకువాని నొకని దీసికొని వచ్చెను. నెలకు 35 రూపికలో, అంత కెక్కుడో ఆత డడిగెను. నే నపు డెంతసొమ్మునియు నిచ్చుటకు సిద్ధముగా నుంటిని. ఏకిన దూది నేకులు చేయుట నామెయే కొందరు బాలురకు నేర్పెను. మా యాశ్రమమున రాట్నచక్ర మిట్లు శీఘ్రముగా బ్రతిష్ఠితమాయెను.

## 53

## ఆశ్వాసాంతము

ఈ యాశ్వాసముల కిక అంతము చెప్పుటయే మిగిలినది.

ఇది మొదలు నా జీవితము ఎల్లరు నెరిగినదేకాన నేను క్రొత్తగా చెప్పదగిన దించుకయు గన్పించదు. నా కలముగూడ నిది యెరిగియే కాబోలు ముందుకు సాగుటలేదు.

పఠితలయొద్ద నింతట సెలవు పుచ్చుకొనుట నాకును కష్టము గానే యున్నది. నాయీ సత్యశోధనమునకు నేను వెలగట్టలేను. దానికి యథార్థ్వా గౌరవము చేసితినో, లేదో యెరుగను. ఉన్న దున్నట్లు చెప్పుటలో నేను శక్తివంచనము మాత్రము చేయలేదు. నాకు సాక్షాత్కరించిన సత్యమును చిత్రించుటకే అవిరతముగ శ్రమపడితిని. సత్యాహింసల ప్రభావమును గూర్చి సంశయించు వారి యెడల కిది విశ్వాసము గూర్చునన్న వెఱ్ఱియాసచే నా పడిన యీ శ్రమ నాకు చిత్తశాంతి యొసగుచున్నది.

ఓం శాంతిః

## BOOKS BY GANDHIJI

| | Rs. | A. |
|---|---|---|
| Bapu's Letters to Mira | 4 | 0 |
| Bapu's Letters to Ashram Sisters | 1 | 8 |
| Basic Education | 1 | 8 |
| Communal Unity | 9 | 0 |
| Constructive Programme | 0 | 6 |
| Delhi Diary | 3 | 0 |
| Drink, Drugs & Gambling | 2 | 8 |
| Gokhale—My Political Guru | 1 | 0 |
| Hindu Dharma | 4 | 0 |
| Selections from Gandhi | 4 | 0 |
| Self-restraint *v.* Self-indulgence | 2 | 0 |
| To the Students | 3 | 8 |
| Truth is God | 2 | 0 |
| Women and Social Injustice | 3 | 0 |

POSTAGE ETC. EXTRA

**NAVAJIVAN PUBLISHING HOUSE**

**AHMEDABAD**



# SATHYA SODHANA

(GANDHI'S AUTOBIOGRAPHY)

*Translated by*

KATURI VENKATESWARA RAO

TRIVENI PUBLISHERS, MASULIPATAM